# విషయసూచిక



---

## చందాదారులకు విజ్ఞప్తి

మావిన్నపాన్ని మన్నించి. కొందఱు చందాదారులు తమచందాలు పంపినా, ఇంకను చాలమంది పంపకున్నారు. వారికి సక్రమంగా ప్రతినెల 'ఆంధ్ర మహిళ' మాత్రం పంపుతున్నాము. వారియెడ మాకు ఉన్న విశ్వాసాన్ని పురస్కరించికొని అయినా, సాధ్యమయినంతత్వరితంగా చందాలుపంపి, యెప్పటిమోస్తరే 'మహిళ'ను పోషించాల్నని కోరుతున్నాము. లేనిపక్షంలో వారికి పత్రిక పంపటం మానుకోవలసివస్తుందని మనవి చేస్తున్నాము. మాసంమాసం జ్ఞప్తిచేస్తున్నా, ఇలా చందాలవిషయం గమనించకపోవటం శోచనీయం. ఈ సందర్భంలో ఇకనైనా చందాదార్లు శ్రద్ధవహించటం ధర్మమని మావిన్నపం.

మేనేజరు,
"ఆంధ్ర మహిళ"




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 17 :: డిసంబరు, 1961 :: సంచిక 12

# పిల్లల శిక్షణలో తల్లుల బాధ్యత

హైదరాబాదు- పురానాపూల్'వద్ద 15-11-61 తారీఖున సాంఘిక విద్యాకేంద్రాన్ని ప్రారంభిస్తూ, ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి, శ్రీదామోదరం సంజీవయ్యగారు ఇలా సెలవిచ్చారు:-

“శివాజి జగదేకశూరుడైన మహావీరుడుగా ప్రశస్తి గాంచాడంటే, దానికి అతనితల్లి చెప్పినపాఠమే కారణం. మనప్రధానమంత్రి జవహర్లాల్‌నెహ్రూ కీర్తిప్రతిష్ఠలు దిగంతవిశ్రాంతమయినదంటే, దానికి అతనితల్లి చిన్నప్పుడు ఇచ్చిన శిక్షణే కారణం. అందువల్ల పిల్లలచదువుల యెడ తల్లులు శ్రద్ధవహిస్తే, పిల్లలుపైకివచ్చి తమకుటుంబాలకు, దేశానికికూడా ప్రయోజనకారులై మంచికీర్తిప్రతిష్టలు తేగలరు”

ఒకానొకకాలంలో పై వాక్యాలు, కొంతవరకు సత్యసమ్మతాలయివుంటే వుండవచ్చును; కాని, అవే యీనాడు పరమసత్యాలని బల్లగుద్ది చెప్పటానికి వీల్లేదు. కారణమేమంటే, పాశ్చాత్య విద్యాసంస్కృతులవల్ల జీవితవిధానాల్లో మార్పులు గల ఉన్నతకుటుంబాలలోని తల్లులకు తమపిల్లలప్రవర్తనలను అనునిమిషం గమనిస్తూ, చక్కదిద్దుతూ వుండటాని కవకాశాలు అనేకం వుండటం సహజం,

అప్పటికీ ప్రపంచజ్ఞానశూన్యులయిన 6-12 ఏండ్లయీడులో వుండే పిల్లలయితే, తల్లుల అదుపులో వుంటారు. ఆతరువాత అసాధ్యం. ఇక మధ్యతరగతులకు, కడపటితరగతులకు చెందిన తల్లులకు విద్య, వివేచన, సంస్కృతి, సంపద, జరుగుబాటు ఇలాటివి తక్కువ. పైగా ఏరోజుకారోజు సంసారనిర్వహణమే వారికొకగడ్డుసమస్య. అలాటి పరిస్థితుల్లో చదువుకొనే యీడుగలతమసంతానంకూడా ఏవిధంచేతనైనా ఏదో ఒకవృత్తిలో ప్రవేసించి, నాలుగురాళ్లుతెస్తేగాని నాలుగువేళ్లూ నోట్లోకి పోవటం దుర్ఘటం. అలాటి పిల్లల విద్యాభివృద్ధికి ప్రభుత్వం ఎన్నిసౌకర్యాలు కలిగించినా, అథవా తల్లులుకూడా శ్రద్ధవహించినా ప్రయోజనం శూన్యం. అసలు నేటిపిల్లలకే విద్యావిషయంలో ఆస్థ మందగించింది. వారు పరిసరాల్లోని అనేకవిచిత్రవిషయాలు, అనగా చలనచిత్రాలు, పందాలు నానావిధక్రీడలు, నవలలు. అవినీతి రేకెత్తించే పత్రికలకథలు, ప్రేమకలాపాల కుడ్యప్ర

దర్శనపటాలు, వాళ్ల విద్యావిహీనతకు దోహదమిస్తున్నాయి. వాటికి తోడు, కాఫీహోటళ్లు, ధూమపానాలు— సరేసరి. అంతదూర మెందుకు? యువతీయువకుల సహవిద్య వాళ్లకళాశాలల్లోని చదువుకు భంగకరాలుగా తయారైనాయి. యువతులకు యువకులతోబాటు విజ్ఞానార్జనం తగదన ముకాని, ఆయిరు తెగలవారికి పాఠశాలలు కళాశాలలు ప్రత్యేకప్రత్యేకంగా వుండాలి. సహవిద్యాప ద్ధతులు ఇతరదేశాల కేమయినా పనికివస్తాయేమో కాని, శీలత్యాగంకంటే, ప్రాణత్యాగమే యుక్తముగా భావించే మన ఆర్యభూమికి భరతఖండానికి, ఏమాత్రం అర్హమయిందికాదు. స్త్రీపురుషజాతులకు సమానమయిన హక్కులు గలదేశాల్లో భార్యాభర్తల శీలసంపదకు అవే గొడ్డలిప్రేటులు కావటం మనమెరగంది కాదు. దాని ఫలితమే విడాకులచట్టమయి కూచున్నప్పుడు మన మాశ్చర్యపడవలసిన ప్రమేయమేముంది? భర్త సజీవుడుగా వుండగానే, అతని అమానుషకృత్యాలకు పాలుపడిన భార్యవిషయంలో, న్యాయంచేకూర్చటం ప్రభుత్వధర్మం. వాళ్లకు అన్యోన్యం పొత్తుకుదర్చటం దానివిధి. విడాకులిచ్చుకోవటంతో విడదీయటానికి ప్రభుత్వమే ఎందుకు? దానంతట అదే జరిగిపోతుంది. మళ్లా వితంతువుల విషయంవేరు. వాళ్లు పునర్వివాహాలకు అర్హులే. మరీబాలవితంతువులయితే తప్పక అర్హులు.

ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, స్వేచ్ఛావిహారం గల నేటియువతీయువకులు తల్లిదండ్రుల ఆజ్ఞలకు బద్ధులై, వారిపెంపకాన్ని యెదురుచూస్తూ, వారిసలహాలు శిరసావహిస్తూ ఇంటిలోనే కూచుని కాలక్షేపం చేస్తారని ఎవరయిన భ్రమిస్తే— వాళ్లు కేవలం వెర్రివాజమ్మలని, మాంధాతకాలంవాళ్లని అనుకోవలసి వస్తుంది.

ఇది ఇలా వుండగా, ఒకరిద్దరు పిల్లలను కన్న తల్లులయితే, బహుజాగ్రత్తగా, కొడుకులను శివాజీలను, నెహ్రూలను, మించేటట్లు పెంచవచ్చునేమో! అప్పుడా తల్లులుకూడా ఉదాత్తగుణం గల జిజియాబాయి స్వరూపరాణులు కావాలిగా! అవుతారా? అంతటి చిత్తసంస్కారం మాతృమూర్తులందరికి వున్ననాడు మనదేశం భరతఖండంకాదు— స్వర్ణఖండం, స్వర్గఖండం అవుతుందనటంలో ఎవరికి సంశయం వుండనక్కరలేదు.

ముఖ్యమంత్రిగారు మరొకమాటకూడా అన్నారు:- "పిల్లలతప్పులకు తల్లులదే బాధ్యత అంటారు"— ఎవరంటారో, వారు చెప్పలేదు. తామే అంటారని అన్యాపదేశంగా భావించాల్సి వుంది. "భార్య గయ్యాళైన ప్రాణనాథునితప్పు, కూతురు చెడుగైన మాతతప్పు"— అని ఒకానొక పూర్వకవి అన్నాడు. ఏలనంటే, కొడుకులు తండ్రిచాలని కూతుళ్లు తల్లిచాలని పెద్దలంటూంటారు. ఒకకుటుంబంలో ఎవడైనా అప్రయోజకుడు పుడితే, "తులసివనంలో గంజాయిమొక్క" మోస్తరు పుట్టాడంటారు. అదే లోకారాధ్యుడు జన్మిస్తే "తుపాకికడుపులో ఫిరంగిరకంగా పుట్టాడని అంటారు. కనుక శివాజీమహారాజులు, జవహరులాలునెహ్రూలు కాలేరు; కాజాలరు.

కాస్త ప్రపంచంలో పడ్డతరువాత, పిల్లకు వయస్సుతోబాటు స్వభావసిద్ధంగా కొన్ని మంచి పద్ధతులు ఏర్పడాలి. కాని, దాన్ని తల్లులు నేర్పలేరు. ఉపాధ్యాయులు బోధించలేరు, ప్రపంచం పరికిస్తూ, మేలుకీళ్లు పరామర్శిస్తూ వారే తమభావిజీవితం సుసంపన్నం కావటానికి పునాదులు వేసుకోవాలి.

ఇక ఆడుపిల్లల విషయం; మన దేశంలో వనితలస్థానం అత్యున్నతమయింది. దాన్ని కాపాడుకోటానికి శతవిధాల మనమహిళలు ప్రయత్నిస్తున్నారు. అందుచేతే, శీలసంరక్షణ వారి ప్రధానకర్తవ్యంగా భావించిన మన పెద్దలు—పరపురుషులకు మనయువతు లెంతదూరంగా ఉంటే అంతమంచిదన్నారు. ఒకవిధంగా అది అంగీకార్యమే.

మన భారతనారీమణులు ఎంత బీదరికంలో వున్నా ఎన్ని బాధలకు అగ్గమయినా, సహించగలరు. కాని శీలత్యాగానికి మాత్రం ఒగ్గరు. సామాన్యంగా స్వయంగా మన అబలలు ఏవృత్తినీ అవలంబించలేరు. విద్య నేర్చుకోలేరు. అరమరిక లేకుండా పురుషులమధ్య మెలగలేరు. అలాంటిసందర్భాలల్లో, వాళ్ల (ఆడబిడ్డల) నైతికప్రవర్తనకు తగిన తరిబీతులను ఇవ్వటానికి ప్రత్యేకంగా మహిళాసంక్షేమ సంస్థలు, ప్రభుత్వంవారి యొక్కయు ప్రజలయొక్కయు సహకారంతో శ్రద్ధగా పనిచేయాలి. ఆర్థికపుష్టిగల దేశాల్లో ఇలాటి సంక్షేమసంఘాలు నెలకొనటం జరుగుతుంది. అట్టివి నిత్యదారిద్రంతో సతమతమవుతూవున్న సంసారాల్లో సాగవు. ఇలాచెప్పటం మూలాన పిల్లలపెంపకంలో తల్లులపూచీ ఏమాత్రం లేదనికాదు మావాదం; ఉన్నది ఎంతవరకు? తల్లుల అదుపులో ఉన్నంతవరకు వారు విద్యార్థిదశలో పుస్తకాలవల్లను గడించేజ్ఞానం వారికి కొంతచైతన్యాన్ని కలగజేస్తుంది. అలా కలగజేసినపుడు కొంతవయఃపరిమితి వఱకు (పుట్టిననాటినుండి పదకొండు పన్రెండేండ్ల వరకు) తల్లుల పోషణలో ఉండి, వారిసలహాల ప్రకారం నడుచుకొనే పసితనం. అట్టిసందర్భంలో వారికి తమయిల్లే ప్రపంచం. తల్లిదండ్రులే మార్గదర్శకులు. తరవాత వాళ్లకు తలిదండ్రుల తరిబీతు అనావశ్యకమవుతుంది. అందులోను తండ్రులంటే కొంతవరకు వారికి వినయవిధేయతలు ఉండవచ్చు. సాధారణంగా తల్లులంటే చనవెక్కువ. కనుక పెరిగేకొద్దీ తల్లిమాటలను ఖాతరుచేయని పిల్లలు నూటికి 95 మంది అయినా ఉంటారని దృఢంగా చెప్పొచ్చును.

మన దేశంలోని పిల్లలవిషయం చెప్పాల్సివచ్చినపుడు, నాయకులేకాక. అధికారులుకూడా "నేటిపిల్లలే భావిపౌరులు" అనే పల్లవి పాడుతూండటం మామూలయిపోయింది. అంతే. వాచా కైంకర్యంతోనే, ఆమహానుభావులు పిల్లల్ని ఉత్తమపౌరులనుగ దిద్దితీరుస్తున్నారు. కార్యరూపేణ దాన్ని అమల్లోపెట్టేసందర్భంలో పప్పులో అడుగు వేస్తున్నారు.

మనపెద్దలకాలంలో మగపిల్లల్ని ఎలా పెంచి, (పెద్దవారయినతరవాత) ఉత్తమ పౌరులనుగా శిక్షణమిచ్చేవారో, క్రిందిశ్లోకం మనకు తెలివిడి చేస్తున్నది:—

"రాజవత్పంచవర్షాణి దశవర్షాణి దాసవత్ ప్రాప్తేతు షోడశేవర్షే పుత్రంమిత్రవదాచరేత్"

అంటే, పుట్టింది మొదలు ఐదేండ్ల వరకు రాజుమోస్తరు ఎల్లప్పుడు చాలఅనురాగంతోనూ ఆదరంతోను చూస్తూ, వాడు కోరినవన్నీ సమకూర్చాలి. ఎల్లప్పుడు వేయికండ్లతో చూడగల విశ్వాసపాత్రులయిన బంట్లను నియమించాలి. మధుర పదార్థాలతో కూడిన రాజభోజనం అమర్చాలి. వేళవేళకు స్నానపానాలు జరిగేట్టు చేయాలి. రకరకాలయిన దుస్తులు సరఫరాచేయాలి. ఆటవస్తువులు చూచినవెల్లా కొని ఇవ్వాలి. వానిజీవితం ఏచింతా, చీకూ లేకుండా మహావైభవంతో నెరవేర్చటానికి ప్రయత్నించాలి.—ఇక ఆరవయేడు ఆరంభంకాగానే

చదువుచెప్పించాలి. ఇంటివరకు చేయదగిన పనులు పురమాయించి "అక్కడికెళ్ళు; ఆ కార్యం చేసుకురా; ఇక్కడికెళ్లు, ఈకార్యం సాధించుకురా!" అని సేవకులను ఆజ్ఞాపించేవిధంగా ఆజ్ఞాపించాలి. ఇలా చేయటంలో పిల్లడికి, పరిసర ప్రాంతాల పరిచయం ఏర్పడుతుంది. ప్రపంచజ్ఞానం కలుగుతుంది, ఇలా దాసుడిమోస్తరు పదేండ్లు పూర్తికావాలి. మొత్తంమీద పదిహేనేండ్లు నిండటంతో గ్రహించే శక్తి అలవడటంచేత పిల్లవానికి వివాహంచేసి, వేరేకాపురం పెట్టించాలి. ఆబాలకుడి విషయంలోను వానిసంసారసందర్భంలోను అయినదానికి కానిదానికి జోక్యంకలిగించుకొని మాటిమాటికి వానిని, (మునుపటిమోస్తరు) గదమాయించటంవల్ల తమకదివరకున్న బెట్టు పోగొట్టుకోవడం, తలిదండ్రుల స్థాయికి ఏమాత్రం తగదు.

నిశితంగా ఆలోచిస్తే ఒకకాలావధివరకే తలిదండ్రుల బాధ్యత ఉండగలదనీ, దాని ఉల్లంఘించినపుడు అవమానం తప్పదనీ తలిదండ్రులు గుర్తెరిగి చరించాలి. అందులోను పిల్లలకు తల్లులవద్ద ఉన్నంతచనువు, తండ్రులవద్ద లేకపోవటం మనకనుభవసిద్ధం. అట్టి పరిస్థితుల్లో పిల్లలసన్మార్గ వర్తనకు తల్లులబాధ్యత ఎంతవరకు చెల్లుతుంది. ప్రపంచజ్ఞానంగల యువకుడైనపుడు, స్వానుభవం వల్ల తన భావికాలజీవితాన్ని కాలానుగుణంగా మలుచుకుంటాడు. దానికెవరిసలహా అక్కరలేదు. మధ్యరకం జాతుల్లోనూ, వెనుకబడిన జాతుల్లోనూ జీవితాన్ని గడిపే తల్లులకు అసలేసాగవు. కనుక ఆ యా రాష్ట్ర ప్రభుత్వాలు తగినప్రోత్సాహం ఇచ్చేయెడల, బిడ్డలను తల్లుల సక్రమమార్గాల్లో పెంచగలరు. అందుకయి వాళ్లు సంక్షేమకేంద్రాలలో తరిబీతుకావటం ఎంతముఖ్యమో, ఆపిల్లలు కూడా మహిళా సంస్థల్లో బోధనాభ్యాసనం పొందటంవల్ల, ప్రభుత్వపరీక్షలలోను ప్రాంతీయ కుటీర పరిశ్రమల్లోను, అచ్చుకూర్పు, బైండింగు, బట్టలనేత, దర్జీపని, బుట్టలు, చాపలుఅల్లటం, పూసలతోను, నూలితోను సంచులుమొదలయినవి తయారుచేయటం, నర్సులుగాను కాంపౌండర్లుగాను శిక్షణ పొంది వృత్తిజ్ఞులు కావటం అంతముఖ్యమయింది. యువతులు పయినచెప్పినవే కాకుండా, వారికి అలవాటయిన యేవృత్తిలోనయినా, సరే, శక్తిసామర్థ్యాలనుబట్టి అర్థికంగా తమకుటుంబాలకుతోడ్పడ వచ్చును. కొందరు ఆభిజాత్యంవల్ల, స్వాభిమానంవల్ల అలాటిపనులు నేర్చుకోకపోవచ్చును. కాని, ఇంట పోషకవర్గనిర్బంధంవల్లనో, మరేకారణంవల్లనో సంక్షేమకేంద్రాలకు వచ్చి, ఎందులోనైనా తరిబీతుపొందకపోవచ్చు. ముందుముందు తమకాళ్లమీద తాము నిలవాల్సిన పరిస్థితులు ఏర్పడినప్పుడు, ఒకరిని యెదురుచూడకుండా జీవించగలరనటంమాత్రం నిస్సంశయం. ఈనాడు మనభారతదేశానికి వచ్చిన స్వాతంత్ర్యానికి మనం పొంగిపోవచ్చును. కాని ప్రజాజీవితం ఎప్పటి రీతిగానే దుష్కరంగా వుండటం శోచనీయం.

ఇప్పటికైనా, ఈనగ్నసత్యాన్ని గుర్తించటం యుక్తం. సాంఘికంగా పురుషులస్థాయి ననుసరించి స్త్రీలుకూడా పైకిరావలసివుంది. లేకుంటే, యిప్పుడు మనమనుభవించే స్వాతంత్ర్యానికి అర్థంలేదు. దీన్ని ప్రభుత్వం గుర్తించిననాడు యువతీయువకులు సమానఛాయలో దేశకల్యాణం చేకూర్చగలదు.

---

*

# వేంకటేశ శతకము

(ఆటవెలఁదులు)

విద్వాన్ శ్రీ వి. చంద్రశేఖరయ్య

శ్రీశగిరిశవాగధీశులరూపునిన్
చిత్తమందు నిలిపి సేవఁజేయఁ
గలుషములు దొలంగి కలుగవా శుభములు
విమతమదవినాశ వేంకటేశ ॥

నాదుగురుని విజ్ఞు వేదము వేంకట
కృష్ణశర్మ సుకవి హృదిఁదలంచి
నీకు నంకితముగ నిర్మింతు శతకమ్ము
విమతమదవినాశ వేంకటేశ ॥

ధనముమీఁద నాశ దారిద్ర్యహేతువు
పడఁతిమీఁద నాశ పాపహేతు
వరయ నాశలేని యాతఁడే శ్రేష్ఠుఁడు
విమతమదవినాశ వేంకటేశ ॥

ఒరులఁదిట్టుచుంట యొప్పనిగుణమగు
సహనముండుటయె విశాలబుద్ధి
కానివానిగూడ గౌరవింపఁగవలె
విమతమదవినాశ వేంకటేశ ॥

కాంచనంబు కాంత కలహకారణములు
వానిమీఁదియాశ వదలువాఁడె
విజ్ఞుఁడంచు నెపుడు వినుతింతురార్యులు
విమతమదవినాశ వేంకటేశ ॥

బిచ్చగానికింత పెట్టనేరనిదాత
దైవములకుఁ బెట్టు దానఫలమె ?
దీనజనుతృప్తి దేవ ! నీకు ముదంబు
విమతమదవినాశ వేంకటేశ ॥

పరులతప్పిదములఁ బలుమారు పేర్కొను
నాతఁ డాతనిదోష మరయలేఁడు
తెలియునొక్కొ క్రింది నలుపును గురిగింజ
విమతమదవినాశ వేంకటేశ ॥

తాను జేసినట్టి ధర్మకార్యంబులఁ
బైకిఁ జెప్పుకొనిన ఫలముకలదె ?
పరులు పొగడుచుండఁ బ్రఖ్యాతిఁగనవలె
విమతమదవినాశ వేంకటేశ ॥

తెలివి, చదువు, ధనము వెలయునా యెప్పుడైన
గౌనములేకయున్న జనునకవని
మణులు హేమఘటితమైననే వెలుఁగును ॥విమ॥

ఆత్మసాక్షి కెప్పు డన్యథా వర్తింప
కుండువాఁడె యుత్తముండు జగతి,
నాత్మ సత్యమతని కప్పుడే యెఱుకగు ॥విమ॥

ఒకఁడు బాగునెంచు, నొక్కఁడోగెంచును
బాగునోగులందు భావమేమి ?
ఆత్మకృతమువలన నవి కల్గునేగాక ! ॥విమ॥

కార్యఫలముఁ గోరఁగా మానవుండెంత ?
మానవుఁడు నిమిత్తమాత్రమంతె !
సకలకార్యఫలము సర్వేశుఁడీవె ॥విమ॥

వారికిది యొసర్చి వీరికిది యొసర్చి
ఫలమదేమి యనుచుఁ బలుకుచుంద్రు
సకలకార్యకర్త సర్వేశుఁడీవెగా ॥విమ॥

ఆశలేదు కాని యందరిసొమ్ముల
వారసుండ నేనె వేఱులేరు
అనుచుఁ బలుకువారి యాశయమెట్టిదో ॥విమ॥

ఇడుమదొడరినప్పు డడుగులఁబడి మ్రొక్కి
పిదప జుట్టుపట్టు పెద్దలెల్ల
నాత్మవంచకులుగదా ! యెప్పుడీధర ॥విమ॥

నిత్యుఁడెవ్వఁడవని? నిర్జరేంద్రుండైన
చావుకాలమైనఁ గావలేరు
ఈరహస్య మెఱుఁగ నేరక చెడెదరు ॥విమ॥

పరులదోషములను బ్రకటించునప్పుడు
ఆత్మదోషములను నరయవలయు
నరయలేనివాఁడు న్యాయాన్వితుండౌనె ॥విమ॥

తన్నుఁ బొగడుకొంట, ధర్మంబుదూరుట
యన్యఘనత కాత్మ నలయుచుంట
పెద్దగౌనములౌనె? పెనురోగములుగాక ॥విమ॥

కల్మషాత్ముఁడగుచు కపటవేషంబుల
పుణ్యజనుఁడు నిజము పుణ్యజనుఁడె
ముష్టిపండు మీఁదుమురిపెంబుఁ గూర్పదా ॥విమ॥

దూషణములుగాని భూషణములుగాని
సజ్జనునకు రెండు సమముసుమ్ము
భేదమెవఁడు చూపు పెద్దయే వాఁడిల ॥ విమ॥

తల్లిచాలు బొల్లి పిల్లయన్ రీతిఁగా
తల్లిదుర్గుణములె పిల్లఁజెందు
ముష్టివిత్తునుండి మొలచునా మామిడి ॥విమ॥

ధనమునందు నేమి గౌనమున్నదో గాని
ధనముధనమటంచుఁ దల్లడిల్లి
గౌనము వీడుచుంద్రు కొందఱు పెద్దలు ॥విమ॥

కార్యసమయములను గడునిచ్చకములాడి
తీరినంత మిపుల దిట్టుచుంద్రు
దీని భావమేమి తెలుపవా గుణసాంద్ర ॥విమ॥

కాయకష్టమునను గడియించి, చక్కగా
బ్రతుకువానిఁ జూచి పరులు మిపుల
నాత్మలందుఁ గ్రుళ్లి యడుగంటుచుందురు ॥విమ॥

స్వార్థమున్న నే పరార్థమ్ము కలుగును
ధాతకైన వానితాతకైన
తన్ను మాలినట్టి ధర్మంబు కలదొకో ॥విమ॥

అతిథిసేవ, దేవతారాధనమ్మును
భర్త యెడ ప్రియోక్తి పరహితమ్ము
ఈగుణమ్ములెల్ల నిల్లాలికొప్పురా ॥విమ॥

పరులకెల్ల హితము పలికి తానట్టులఁ
జేయనట్టి జడుని జీవితంబు
హేయభాజనంబ యేయెడనైనను ॥ విమ॥

అల్పుఁడొకఁడు తప్పు నాచరించినదాని
నోర్చి, లక్ష్యపెట్టఁ డుత్తముండు
చీమకుట్టినంత సింగంబు ద్రుంగునా ॥విమ॥

ఆలు దూరమైన నన్యను బెండ్లాడ
వచ్చుఁగాని పితలు చచ్చిరేని
నెన్నివేల జన్మలెత్తిన వత్తురా ॥విమ॥

అత్త పగులఁగొట్ట నడుగోటి కుండయుఁ
గోడలట్టె గొట్ట క్రొత్తకుండ
యనెడి నీతినుండు రార్యులు కొందఱు ॥విమ॥

తెల్లవారలేచి తెగడిట్టి మగనిని
సాధ్వీధర్మములను జాటుచుండు
రామ రామ యగునె? రాకాసి గాకుండ ॥విమ॥

న్యాయమడిగినంత నాగాత్యములుచేసి
పరులనోరుగట్టు పండితులకు
న్యాయరూపమెఱుఁగ నవకాశముండునా ॥విమ॥

ఆత్మదోషములనె యారోపణముసేయు
నితరులందు క్షుద్రుఁడెపుడు, సుజనుఁ
డాత్మసుగుణరాసి నారోపణముసేయు ॥విమ॥

భుక్తికైన వెనుక ముక్తికి మార్గంబు
భుక్తిలేక ముక్తి పొసఁగునెట్లు?
ఆత్మతృప్తియైన నన్నియు కలుగును ॥విమ॥

విపులహృదయమంచు, విశ్వాసమంచు. గృ
తజ్ఞతనుచుఁ బలుకు తజ్ఞులెల్ల
వానియర్థమేమొ వచియింపనేర్తురా? ॥విమ॥

తనజనాళియెడల దాక్షిణ్యభావంబు
భృత్యులందు దయయుఁ బితలయెడలఁ
బూజ్యభావముంట పొసఁగు సజ్జనులకు ॥విమ॥

జ్ఞానమున్న నేమి? ఘనుఁడౌనె పరదోష
సహనముండవలదె సజ్జనులకుఁ
గుక్కఁ గొట్ట పసిఁడికోల కావలయునా? ॥విమ॥

కానుఁగాంచినంతఁ గాఁజేయు బుద్ధితోఁ
గల్లబొల్లిపలుకు కపటులెల్ల
హృదయశూన్యులంచు నెంచఁగావలయును ॥విమ॥

తాము సేయు సేఁత తగినది; పరులదే
చేసిరేనిఁ, దప్పుఁ జెప్పునట్టి
ఘనులఁ జేరినంత కష్టంబుకలుగదా ॥విమ॥

శత్రులైనయంత శపియింపవలయునా?
వారిమేలుఁగూడఁ గోరవలయు
సర్వజనులమేలు సర్వేశుఁడీవె? ॥విమ॥

తీసికొనినధనము తిరిగి సంతసమున
నిచ్చువాఁడుకలఁడె యెచ్చటైన
ఘనుఁడుగూడ ఋణము గైకొన్నయప్పీయ ॥విమ॥

ఎంతవచ్చుచున్న నెల్లప్డు లేదని
యేడ్చువానియింట నెట్టులుండు
లక్ష్మి, యామెయక్క లాస్యంబుసేయదా? ॥విమ॥

మగనికనులఁ గప్పి మారుత్రోవలఁ జొచ్చి
యింటకలుగు వస్తులెల్ల నమ్మి
డబ్బుచేర్చుదాని డాంబిక మేమందు ॥విమ॥

విసుగులేక యొప్పు వెట్టిమెట్టిగ వాగు
విమతికూఁత కెట్టి విలువయుండు
నెపుడు మొఱుగుకుక్క నెవఁడులక్షించును? ॥విమ॥

తన్నుఁ జేరునతఁడు వన్నెఁగాంచునటంచుఁ
బలుకుచుండు పెల్ల వ్యర్థముగద!
ఎల్లవారివన్నె నెవఁడు చేకూర్చునో ! ॥విమ॥

అర్థవిద్య లెపుడు నార్జింపఁ బురుషులు
నింటిపనులఁ జేయనింతులెల్ల
ప్రాలుమాలినంతఁ బాకంబు తప్పదా ॥విమ॥

ఉవిద రోగియైన నొప్పును సేవింప,
మొక్కవోలె నుండ పురుషుఁడేల
సకలవిధములైన చాకిరిచేయును ॥విమ॥

పెద్దలెట్టిసుద్ది బేరంది వెలసిరో
పిన్నలట్టిసుద్ది వెలయ లెన్స
యనుచు మాయకాఁడు జను మాఱుత్రోవల ॥విమ॥

# "వారసత్వం"

శ్రీ "సారథి"

తొలిజాము కోడి కూయడంతోటే లేచి కూర్చుంది. పార్వతి. ఆ అనాథసంరక్షణాలయంలో గతమూడు సంవత్సరాలుగా ఆమెకిది పరిపాటయిపోయింది. ఆ సంరక్షణాలయంలోగల దాదాపు ఇరవై మంది బాలబాలికలకు తానుతల్లిగా, గురువుగా, చివరకు సర్వం తానై వుంటుంది. ఆపసిపాపలముఖంలో కన్పించే చిరునవ్వులను, వాళ్ల ఆనందించే ఏకొద్దిపాటి ఆనందాన్నైనా చూచి తృప్తి పడుతుండేది పార్వతి.

అలవాటుప్రకారం ఆపుదయం ఆమె లేచి వచ్చి వసారా తలుపు తీసింది. తలుపుతీయడంవరకు వున్నబద్ధకం అక్కడ కన్పించిన దృశ్యాన్ని చూడ్డంతోటే పటాపంచలయింది. అంతగా ఆమె నాకర్షించినదృశ్యం మరేంలేదు. అందమైన ఓపసిపాప అక్కడుంటమే:- ఎవరో పాపం ఆపసికందును అక్కడుంచి వెళ్లారు. పార్వతి ఆపాపను అమాంతం తీసుకుని హృదయానికి గాఢంగా హత్తుకుంది. ముక్కుపచ్చలారని ఆముద్దుబిడ్డని అంతనిర్దాక్షిణ్యంగా అక్కడుంచి వెళ్లడానికి, ఏమాతృహృదయానికి మనసొప్పిందో? ఎవరి పాపచిహ్నమో? ఇలా ఇంత నిర్గతిగా వదిలెళ్లారు. కృతఘ్నులు అని తలపోసి పాపనెత్తుకుని లోనికెళ్లింది.

ఆరోజు ఆమె దినచర్యలో రోజుకంటె వుత్సాహం అధికంగా కన్పించడంతోపాటు మార్పుకూడ వచ్చింది. ఆమె అధికంగా ఆపాపమీద శ్రద్ధతీసుకోజొచ్చింది. ఆ పాపను "సుగుణ" అనిపిల్చి తృప్తిజెందుతుండేది. కారణం ఆమెకు సుగుణన్న పేరుగల అమ్మాయి, నాలుగేండ్లప్పుడు మశూచికంనోకి తల్లికి దూరమయింది. ఆసంఘటన తలచుకున్నప్పుడంతా ఆమెకన్నులలో అశ్రువులు నిల్చేవి.

సుగుణ అనాథశరణాలయానికొచ్చి దాదాపు రెండు నెలలు కావస్తుంది. పార్వతికి సుగుణను విడిచి ఒక క్షణం వుండలేని పరిస్థితి ఏర్పడింది. ఆమె సుగుణలేని జీవితం వృథా అని తలపోసింది. సుగుణను గురించి ఎక్కడెక్కడో వాకబుచేసింది. ఎందర్నో ప్రశ్నించింది. కాని ఏంప్రయోజనం లేకపోయింది. ఈరెండునెలల పసిపాప ఆ సంరక్షణాలయంలో పెరగడాన్ని గురించి ఆవూరంతా ఒకటే పుకారు- "పార్వతమ్మటీచరు ఎక్కడో ఓపాపను తెచ్చుకుంది" అన్నారు కొందరు. "కాదు ఇదేదో గూడుపుఠాణి" అన్నారు మరికొందరు. ఈమాటలను పెడర్థాలను ఖాతరు చెయ్యలేదాపార్వతి. "ఏదో కొండనుచూచి కుక్క మొరుగుతుందిలే" అని అనుకుని తనపాట్లేదో తను పడుతూంది.

లోకం చెడ్డను ఎప్పుడూ ఆదరించదు. అలాగే మంచిగాప్రవర్తించినా, ఒక్కొక్కప్పుడు సహించదనుకుంది పార్వతి.

ఈలోగా ఓరోజు వున్నట్టుండి ఆమెకొకవుత్తరం వచ్చింది. ఇన్నిసంవత్సరాలుగా తనకు జాబువ్రాసే వారెవ్వరు లేరనుకుంటున్నప్పుడు, ఈరోజు హఠాత్తుగా ఆవుత్తరంరావడం ఆశ్చర్యంగానే కన్పించింది. ఆకవరును తీసుకుని పరీక్షించింది. "ఆ- నిజంగా తనకే వ్రాసిన వుత్తరమని" నిర్ణయించుకున్నతర్వాత, కవరును చించి, వుత్తరాన్నితీసి చదువనారంభించింది. ఆవుత్తరం చదువుతున్నంతసేపు ముఖంలో విషాదచ్ఛాయలు గోచరించాయి. ముఖమంతా పాలిపోయింది. ఒక్కసారి తనివిదీరా ఏడ్చింది. ఇంతకీ ఆవుత్తరం ఆమె స్నేహితురాలు జానకి వ్రాసింది.

పార్వతీ:

"ఎన్నోసంవత్సరాలతర్వాత నీకీవుత్తరం వ్రాస్తున్నా. అసలు నీవు మనిద్దరిబాంధవ్యాన్ని అంతత్వరగా మరచి వుండవనుకుంటా. మనిద్దరిస్కూల్ చదువు ముగిశాక, నే నిన్నువిడిచివచ్చేశా. తర్వాత నీవక్కడే ఏదో అనాథశరణాలయంలో టీచరుగా వుంటున్నావని తెలిసింది. నేనెక్కడుంటున్నానన్నది, బహుశా నీకు తెలియదు కాబోలు. అందుకే నీవివాహానికిసైతం, కనీసం పత్రికనైనా పంపకపోయావు. పోనీలే:-అయిందేదో అయింది. నేకోరడమల్లా నీవైనా సుఖంగా జీవించడమే.

నాగురించినకథకూడ నీవుతెల్సుకోవాలి. నీతో నేరుగా చెప్పాలనుకున్నా. నామనస్సెందుకో నీప్రశాంతమైన ముఖాన్ని చూడకూడదనుకుంది. నేను లోకందృష్టిలో పాపిని- పార్వతి- నేపాపిని, నేను నిన్నువిడిచి వెళ్లిం తర్వాత ఆవూర్లో పబ్లిక్ప్రాసిక్యూటర్గారబ్బాయితో పరచయమయింది. ఆపరిచయం కాలక్రమేణా ఎడతెగని బంధంగా మారింది. పెండ్లి చేసుకుంటానన్నాడు. ఎన్నో

ఆశలు చూపాడు. నేను అల్పసంతుష్టుని పార్వతి. అందుకే అతను చెప్పినమాటలకు లొంగిపోయాను. నాజీవితం నాశనంచేసుకున్నా. చివరికొకరోజు నాతో చెప్పా పెట్టకుండ, అతను పైచదువులకని విదేశాలకు వెళ్లాడు. పార్వతి—నాహృదయం ఎంతగా గాయపడిందో తెలుసా? అయినా, నేనిప్పుడు బాధపడడంలో అర్థంలేదు. ఇది చేసేతులా చేసుకున్నది. గనుక ఆపాపానికి తగినఫలం నేననుభవించాల్సిందే.

నే పాపినని సంఘం వేలెత్తి చూపెట్టింది. నన్నందరు ద్వేషించారు. హేళనచేశారు. కాని, మా అమ్మ తను ఎంతబాధపడ్డా నన్ను వూరడించి సముదాయించింది. నా బాధ వర్ణనాతీతం పార్వతి, ప్రతినిమిషానికి నేచచ్చిపోవాలనుకున్నా, మాఅమ్మ నన్ను కంటికిరెప్పలా కాపాడుతూ వచ్చేది, ఏలాగో కష్టపడి రోజులు గడుపుకొచ్చాం. ఈలోగా నేనోచక్కటిపిల్లకు తల్లినయ్యాను. కాని, నాదురదృష్టం మాఅమ్మ నన్నేకాకిగా ఈలోకంలో వుండనిచ్చి నాకు దూరమయింది. ఇప్పుడు నేనుచంటిబిడ్డతో ఎక్కడికెళ్లగలను? ఏలా, జీవించగలను? అని బాధపడ్డప్పుడు, పార్వతీ, వెంటనే నీవు నాస్మృతిపథంలో మెలిగావు.

ఏదోనిశ్చయంతో బయల్దేరి మీవూరొచ్చా. చంటి పిల్లను మీఅనాథశరణాలయం ముంగిట వుంచి నేనొచ్చేశా— పార్వతి— నిన్నెంతగానో చూడాలనివుంటుంది. అప్పట్లో— కాని నీకెలా ఈపాపిష్టిముఖాన్ని చూపగలను, అందుకని వెంటనే తిరిగొచ్చేశా. పార్వతి, నిన్ను యాచించేదంతా, ఆపాపను పెంచి కాపాడడమే— ఈ పాపి ఆ పసిపాపతల్లి అనిమాత్రం లోకానికి, ముఖ్యంగా ఆపాపకే తెలియకూడదు. ఈరహస్యం మనిద్దరిలోనే చావాలి. నన్నుగురించి నీవధికంగా బెంగపెట్టుకోకు. నాకు జీవితంమీద విరక్తి పుట్టింది. అట్టే అన్నిరోజులు ఈప్రాణాల్ని కాపాడుకోలేను. కూడదుకూడ. అసలు నేను భూమికిభారం పార్వతి, మర్చిపోకేం— అమ్మాయిని కాపాడడం నీవిధి అనుకో—నన్ను క్షమించవూ"

ఇక సెలవా,

'జానకి'

పార్వతి ఎంతసేపాలా వుత్తరాన్నిచూస్తూ ఆలోచిస్తుండిందో తెలియదుకాని, వుయ్యాలలో 'సుగుణ' ఏడ్వడంతోటే ఈలోకానికొచ్చిపడ్డది. అతికష్టంతో సుగుణ నెత్తుకుని సముదాయించింది. సుగుణ ఏడవటం మానుకుంది. కాని తనేడవకుండ వుండలేకపోయింది.

రోజులు ప్రశాంతంగా దొర్లుతూ, కాలచక్రంలో ఇరవైసంవత్సరాలు గడిచాయి. సుగుణకు పార్వతి తల్లయి వుంటుంది, తల్లంటే అంతఅపేక్ష, అనురాగం కూడ. తల్లిమాటకెదురెన్నడు చెప్పదు. మంచికి నిర్వచనం సుగుణే.

ఇప్పట్లో సుగుణ కాలేజి చదువుతుంది. ఆమెచదువులో చూపుతున్నశ్రద్ధ, వుత్సాహం అందర్ని ఆకర్షించింది. అందులో ముఖ్యంగా ఆమెతో చదువుతున్నసారథికి సుగుణంటే, ప్రత్యేకవాత్సల్యం. సుగుణకుకూడ సారథిని చూస్తూ అతని తేనెలొలికే పలుకులలో తన్నుతానే మర్చిపోతూండేది. యౌవనం వాళ్లిద్దర్ని సన్నిహితుల్ని చేసింది. ఒకర్నొకరు విడిచి జీవించలేం అన్నంతవరకు వచ్చింది.

ఓరోజు సుగుణ సారథిని పిల్చుకెళ్లి పార్వతికి పరిచయంచేసింది. పార్వతికి సారథి నిజంగా నచ్చాడు. అతనికంటె అతనిఆశయాలు, ఆదర్శాలు అధికంగా ఆమె నాకర్షించాయి. అంత మంచివాడి స్నేహితాన్ని సుగుణ పొందడంగురించి పార్వతి ఆనందపడ్డది. వీళ్లిద్దరు దంపతులు కావాల్సిందని మనస్సులోనే వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంది పార్వతి. ఆకోరిక ఆమెలో చాలరోజులుగా కోరికగానే వుండిపోయింది. సుగుణకు తన్ను సారథికి పెండ్లాడలన్న వుద్దేశముందని చెప్పడానికి సిగ్గు, అంతకంటె భయం, చివరికొకరోజు సారథితో కలిసి సుగుణ ఈమాటను పార్వతిచెవుల వేసింది. ఈమంచివార్తకై ఎన్నోరోజులుగా కాచుక్కూర్చొంది తను, అటువంటప్పుడు తనెందుకు కాదంటుంది?

సారథి తనఇంట్లో వాళ్లకు వ్యతిరేకంగా సుగుణతో రిజిష్ట్రారుసన్నిధిలో చేతులు కలుపుతాడు. వీళ్లిద్దరిఆనందం వేరు, పార్వతిఆనందం వేరు.

ఆ అనాథసంరక్షణాలయ భారాన్ని నడిపే స్తోమత, శక్తి పార్వతిలో నన్నగిల్లడంవల్ల తమతో వచ్చివుండాల్సిందిగా కోరారు, బ్రతిమాలారు, సుగుణసారథు లిరువురు. పార్వతి ససేమిరా వల్లకాదంది. ఆ వాతావరణాన్ని, పరిసరాల్ని వదలి బయటి ప్రపంచంలో ఒక్కడుగు ముందుకేయలేనని నిష్కర్షగా చెప్పింది. తల్లి అంత కటువుగా మాట్లాడి తనెప్పుడు చూడలేదు; కాబట్టి సుగుణ మాటాడక వూరుకుంది.

అప్పుడప్పుడు సుగుణసారథులిరువురు పార్వతి నొచ్చి పరామర్శించి పోతుంటారు. వీళ్లిద్దర్ని చూస్తూ

తనస్నేహితురాలు "జానకి" కోరిక తను నెరవేర్చిందని ఎంతగానో సంబరపడిపోయేది పార్వతి.

ఆపై ఏడాదికి సుగుణ ఓచక్కటిపిల్లను కన్నది. ఆబింబం ముమ్మూర్తులా తల్లిని పోలివుంది. పార్వతి అపాపకు ''జానకి''అని పేరు పెట్టాల్సిందిగా కోరింది. సుగుణసారథులిరువురికి ఆపాపకు మరేదో పేరుపెట్టాలని వున్నప్పటికి, పార్వతి ఇంతపట్టుదలగా ఆపాపకు ''జానకి" అని పేరుపెట్టడంలో శ్రద్దెందుకు చూపెడుతుందో అర్ధంకాని సత్యంగానే వుండిపోయింది. ఆమాటకెదురుచెప్పలేక పోయారు. "జానకి'' తనకిప్పుడు సర్వస్వమైపోయింది పార్వతికి.

సుగుణసారథులిరువురు ఆవూర్లోనే కాలేజిలెక్చరర్లుగా పనిచేస్తున్నారు. ఆ ఆదర్శదంపతులను చూచి అందరు హర్షించారు;- కొందరు బాధపడ్డారుకూడ.

కాని విధి బలీయమైనది.—

ఓరోజు సారథి కాలేజిలో అతిప్రమాదమగు Experiment చేస్తూ పరాకున Electric Wire పట్టుకున్నాడు. ఫలితం అంతమంచివాడు అందరికి దూరమయ్యాడు. ఈవార్త వింటో సుగుణ శోషిల్లి పడిపోయింది.

ఆమెకు జీవితం శూన్యమన్పించింది. సుగుణకంటె అధికంగా బాధ పడ్డది పాపం పార్వతే.— తానన్నరోజులు పడ్డ కష్టాలన్ని తీరిందనుకున్నంతలో, ఇంతటిఘోరం తనకళ్లెదుటనే జరిగింది. అందుకు తనసుగుణ ఆహుతయిందనుకుంటూ భోరున ఏడ్చింది. నిజంగా దేవుడు సుగుణపట్ల కాఠిన్యంగానే ప్రవర్తించాడు. సుగుణ ఏంపాపం చేసిందని ఇంతనిర్దాక్షిణ్యంగా శిక్షించాడని బాధపడింది, ఆమాతృహృదయం.

మళ్లీ రోజులు అతికష్టంతో గడుపుతున్నారు తల్లికూతులిరువురు. సారథి దూరంకావడంతో సుగుణ వుద్యోగానికి రాజీనామాఇచ్చింది. ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూ, ఆలోచిస్తూ కుర్చొంటుంది. పార్వతి తను పడ్తున్నబాధ వుపశమనం కావడానికి చేసిన ప్రయత్నాలు బూడిదలో పన్నీరయి బాధను అధికపర్చాయి – ఫలితం తను సుగుణను ఓదార్చ లేకపోతోంది- సుగుణకు తనపాప ''జానకి'' మీద ఒకవిధమైన అసహ్యం, జుగుప్స ఏర్పడుతోంది. అదిపుట్టి తన్ను నిర్గతిగాచేసిందని సదా తిట్టుండేది. ఆమె బాధ ఆమె నాలా ప్రవర్తింపజేస్తోంది.

కాని, పార్వతే ఆపాపను సముదాయించి సంరక్షిస్తూ వస్తోంది.

పార్వతి తనకు జానకి వ్రాసిన ఉత్తరాన్ని అతిజాగ్రత్తగా దాచివుంచిం దిన్నిరోజులు— ఆవుత్తరం అకస్మాత్తుగా ఓరోజు సుగుణకంట పడ్డది. ఎందుకని పార్వతి తనకుమార్తెకు "జానకి"అని పేరుపెట్టాల్సిందిగా ప్రాకులాడిందో, సుగుణకు ఇప్పుడు బాగా అర్ధమైంది. తన జీవితం ఇంతటికలుషితమైందని తలంచి, పాపం చాలా బాధపడిపోయింది. ఆమె హృదయంలో ఏర్పడ్డగాయం ఎప్పటికీమానదని అనుకున్నప్పుడు మరొక్కసారి విలపించింది.

ఇక తానీవూళ్ళో వుండలేననుకుంది. పార్వతినిపిల్చుకుని మరెక్కడైనా వెళ్ళామనుకున్నా, పార్వతి ఆప్రదేశాన్నొదలి రాదు. కాబట్టి తను వెళ్లడానికే నిశ్చయించుకుంది. ఆరాత్రికి రాత్రే వూరంతా ప్రశాంతంగా నిద్రాదేవి ఒడిలో తలదాల్చుకుంటున్నప్పుడు, సుగుణ భారంగా అడుగులేస్తూ, పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ, వెళ్లిపోయింది.

వుదయం యథావిధిగా సుగుణను లేపుదామని పార్వతి పక్కలోకెళ్లి చూచి, నిరాశచెందడంతోపాటు ఒకందుకు భయపడ్డదికూడ.- కాని మరుక్షణం వుయ్యాలలో ''జానకి" ఈలోకాన్ని మరచి నిద్రించడం చూచి పార్వతిమనస్సు కుదుటపడింది. అంతలో అక్కడున్న వుత్తరంమీద ఆమెదృష్టి పడింది. వెంటనే ఆతురతతో చదువసాగింది.

అమ్మా !

నీవు నన్ను క్షమించాలి. నిన్ను, కన్నపాపను విడిచి వెడుతున్నానంటే, నేనెంతకఠినురాలనో అని అనుకుంటావు కాని అమ్మా, నాబాధ నీకర్థంకాదు. నేనిక్కడుండి ఒక్కొక్కక్షణం మృత్యువు నెదురుచూడడం కంటె, శాశ్వతంగా అమృత్యువు నెదురుచూచి, వెళ్లటం మంచిదిగా కన్పించింది. అయినా అమ్మా, నీవెందుకు పాపకు ''చానకి" అని పేరుపెట్టాలని పట్టుపట్టావో నాకు తెలియదనుకున్నావా? నాజీవితం కలుషితం, నేనెలా నీపంచ చేరానో ఆలా నాపాపను నీవద్దనేవుంచి వెడుతున్నా; కాని పాపజీవితంకూడా నాలా ఏర్పడ్డదని అనుకుంటా!– అందుకు ఆదేవుడే సహాయపడాలి–

అమ్మా! నన్ను క్షమించానని ఒక్కసారి అను.–

"సుగుణ"

కొందరిజీవితం జీవించడానికి ఏర్పడుతుందంటారు. కాని పార్వతిజీవితం ఏడ్వడానికే ఏర్పడిందిగా కన్పిస్తుంది. ఏడుస్తూ వుత్తరాన్ని మడిచి అలా ఒక్కసారి వుయ్యాలలో "జానకి" ని చూచింది. ఆపసిపాప నిద్రలో ఒకచిరునవ్వు నవ్వింది. తనతల్లి తన్ను నిర్దాక్షిణ్యంగా విడిచివెళ్లిందని పాపం దానికేంతెలుసు?

"ఆరోజు "జానకి" సుగుణను వదలివెళ్లినప్పుడు ఆ "జానకి" తనకు పరోక్షంగా మోసపోయింది. ఈరోజు సుగుణ ఈ "జానకి" నొదలి వెళ్తున్నప్పుడు ఆమెజీవితం తనయెదుటనే ధ్వంసమయింది. ఏది ఎలాగున్నా, వాళ్లిద్దరినిర్ణయాలు, ఫలితాలుకూడ ఒకటే అయింది. ఒకవేళ ఇలా జరగాలన్నది ఆవంశానికి శాపమేమో" అని యోచిస్తూ, భారంగా అడుగులేస్తూ, కన్నులలో నిల్చిన అశ్రువుల తుడుచుకుంటూ, లోనికి దారితీసింది, పార్వతి.

---

## మా బ్రతుకులు

**శ్రీమతి పద్మావతీగంగాధర్**

విసిరేసిన ఎంగిలియాకులు
కసిరేసిన గుప్పెడుమెతుకులు
మసకేసిన మాబ్రతుకులకు
ప్రకృతియిచ్చిన పరమాన్నం॥

దయచేసిన మూరెడుబట్ట
వదిలేసిన చెట్టూపుట్ట
స్వార్థరహిత మాబ్రతుకులకు
దైవంచూపిన సహకారం॥

కష్టం తెల్సిన సూర్యచంద్రులు
బాధ లెరింగిన గాలి వానలు
కరుణకల్గిన పురుగు పుట్రలు
పాప మెరిగిన మాపాలి బాంధవులు॥

మందులు లేని బ్రతుకులు మావి
ఆశలెరుంగని పిల్లలు మాకు
బజారులోని కుక్కపిల్లలలా
భవితలు లేని బాలలు వీరు॥

---

# మగవారి మనసు

శ్రీమతి వాసిలి అపర్ణాదేవి

ఈశ్వరరెడ్డి కాలేజినివదలిపెట్టి ఇంటికొచ్చేసరికి. 4 గంటలుకూడ దాటిపోయింది. ఇండ్లు. వీధులు, అతనికి దూరమైనాయి. తోటిలెక్చరర్స్ యింకా వదలిపెట్టలేదు. స్టూడెంట్సుమట్టుకు సైకళ్లమీద బారులుతీరి, మనకెందుకులే అన్నట్లు వెళ్లిపోతున్నారు. ఈశ్వరరెడ్డి ఎవ్వరికీ తెలియకుండ, తనలో తనే విసుగుపడ్డాడు. పక్కవారికి తెలియకుండ, అది అంతంలేని సంభాషణ గనుక, విరామం లేకుండ విసుగెత్తించినా, సాగిపోతూనే వుంది. అడ్డు చెబితే వారి ఆనందాన్ని అరికట్టినవాడవుతాడు. అందుకే తనహృదయంలోని అట్టిబాధ. ఎవరికి తెలియకుండ ఇల్లుచేరుకున్నాడు.

కాని... తనని గుర్తించేవారెవరూ లేరు. ఏంచేస్తాడు? చెయ్యగలిగింది మట్టుకేముంది? కుర్చీలో కూర్చున్నాడు. కాని మనస్సు మనస్సులో లేదు. తలగిర్రున తిరగిపోతుంది. మనిషి కుర్చీలోనే కూర్చున్నాడు. మనస్సు, భావాలు మట్టుకు అక్కడలేవు తన మామూలు పనులనుగూడ మర్చిపోయి, మనస్సులో, మరుగునపడున్న సత్యాన్ని, అవగాహనం చేసుకుంటున్నాడు. వొంటిమీది అమెరికన్ జాకెట్ తడిసి ముద్దలా అయిపోయింది. ఫాంటు విడువనేలేదు. అలాగే టేబిల్ మీద తలపెట్టి వాలిపోయాడు.

ఇంతవరకు ఎవరికీ తెలియని ఒక గొప్పరహస్యం అతనిలో దాగివుంది. కాని ఎవరికి తెలియదనుకోటం పొరపాటు, తెలిసివుంటుంది. కాని వుబకలేదు, అదే ఈదాగుడుమూత. బూచివాడొస్తాడని భయపడటం.

ఈశ్వరరెడ్డి అటు, ఇటు మసిలాడు. మత్తుగావుంది. మందంగా తనచుట్టూ చూచుకున్నాడు. ఎవరూ కనబడలేదు. బరువుగా నిట్టూర్చాడు. కండ్లలోకి నీరు చిమ్మింది.

వెంకడు వచ్చి 'కాఫి తెమ్మంటారా? అయ్యగారు!' అన్నాడు. ఈశ్వరరెడ్డి సమాధానానికి దూరంగా వున్నాడు. అయ్యగారి తల వేడెక్కిందనుకుంటూ, వెంకడు ఫ్లాస్కులో టీ, పోసుకొని, మరోచేతిలో టిఫెన్ తీసుకొచ్చి, టేబుల్ మీద పెట్టాడు. మనస్మరణలో లేని ఈశ్వరరెడ్డి, స్పర్శతగిలినట్లు వులిక్కిపడ్డాడు. అనుకోకుండా అయిన వెంకడిదర్శనానికి, చీమలు జెర్రులు ప్రాకినట్లనిపించింది. ఆశాపూరితమయిన. హృదయంలో అగ్ని రగులుకుంది. కొరకొరా చూచాడు. వెంకడు వణికిపోయాడు.

'వెంకడూ! మల్లిక వెళ్లిపోయిందా?' అన్నాడు రెడ్డి 'ఇంకా రాలేదయ్యగారు!' అన్నాడు, భయంకంపిత హృదయంతో.

“ఎక్కడున్నావురా? రాలేదంటావే! ట్యూషన్ కి వచ్చింది కదురా....” అన్నాడు ఈశ్వరరెడ్డి, ఏమి తెలియని పసివానిలాగ.”

'ముందు కాఫి తీసుకోండయ్యగారు' ఆరిపోతుంది అన్నాడు భయపడుతూ.

ఈశ్వరరెడ్డి కాఫి తాగుతు ఆలోచనల వత్తిడిలో నలిగిపోతున్నాడు. ఆడవాళ్లు లేని ఇల్లు అరణ్యంలాగే వుంటుంది. ఏమూలచూచినా కాంతిఅంటూ వుండదు. బావురుమంటుంది. తనలో చెలగాటమాడుతున్న నిరాశల్ని పోగొట్టి, ఆనందంగా దగ్గరకు తీసేట్లులేదు, ఇంటిశోభ. నిజంగా మల్లికవుంటే ఎంతబావుండేది!' ఈక్షణంలో అనుకున్నాడు. మనస్సులో తిరుగుతున్న మల్లిక స్వర్గసీమల్లో తేలిపోతున్న ఈశ్వరరెడ్డిని, ఈలోకంలోకి తీసుకొచ్చింది. ఆమెసౌందర్యానికి అతడు దాసుడయ్యాడు. శరీరాన్ని మైమరచి, మగువప్రేమలో పడ్డాడు. మల్లిక వొంటిమీద అరిటాకుపచ్చచీర. రబ్బరుసిల్కు కావటం చేత, పాముకుబుసంలా జారిపోతోంది. అదేరంగు జాకెట్ వేసుకొంది. ఎడమచేతికి లేడివాచి... అంతేకాకుండ చిటికెనవేలికి ఒకవుంగరంకూడా వుంది. సంపంగిపువ్వులతో తల ఘుమఘుమలాడిపోతోంది. 'మాస్టారూ! పాఠం చెబుతారా? కొంచెమాలస్యముందా!' అంది మెల్లిగా మల్లిక.

ఈశ్వరరెడ్డి సిగ్గుపడ్డాడు. సమాధానం చెప్పలేకపోయాడు. పుట్టి బుద్ధెరిగిన తరువాత, ఇలాటి సంఘటనల్లో పాలుకొనటం. ఇదే మొదటిసారి. అందుకే సిగ్గు కుంగతీస్తుందతన్ని, మల్లికకు పాఠం చెప్పాలనేమాట మర్చిపోయి, ప్రేమకలాపాల్లో ప్రణయదేవతని ఆరాధిస్తూన్నాడు. మల్లికహృదయంలో ఆరాధ్యదేవుడుగా నిలబడి, 'సరససల్లాపాలు ఎప్పుడు,ఆడాలి? అప్పుడు మల్లిక నన్ను తెలుసుకొని, నాతత్వాన్ని అర్థంచేసుకుంటుంది... కాని కోపగించుకుంటుందేమో···! అప్పుడు ఏంచేసేట్లు?' అనుకున్నాడు.

మల్లిక టేబులు ముందు కూర్చుని చదువుకుంటుంది. ఆమె ఇదంతా గమనించలేదు. మామూలుగానే పాఠంచెప్పండని అడిగింది. సమాధానానికి బదులు, సిగ్గుతోగూడిన చిరునవ్వు నవ్వాడు. ఆమెగుండెల్లో బండ పెట్టినట్లనిపించింది. కండ్లలో నీరు చిమ్మింది. నుదిటిమీద చెమటబిందువులు ఏర్పడ్డాయి. నోటినుండి మాటరాలేదు. 'పాఠంచెప్పండి మాస్టారూ. వెళ్లిపోతాను అంది. క్షీణస్వరంతో. బరువెక్కిన హృదయంతో తలఎత్తకుండానే.

“ఈపూట పాఠం వొద్దులే! “రేబక” తెచ్చాను... ఈనవల ఆంగ్లంలో ఎంతో చక్కగా వ్రాయబడింది... దీన్ని చదివి అవగాహనచేసుకో అన్నాడు.” ఎంతోపరిచయుడిలాగా·”

ఈశ్వరరెడ్డిలో ఇన్నిరోజులనుండి, దాగివున్న ఈనగ్నసత్యాన్ని, ఈరోజే తెలుసుకోగలిగింది మల్లిక. మాస్టరు చెయ్యి తగలగానే మాటరాలేదు. స్తబ్ధురాలయింది. కొద్ది క్షణాలు శిలాప్రతిమలాగ వుండిపోయింది. ఈశ్వరరెడ్డి ఇటువంటివాడని అనుకుంటూ వెళ్లిపోయింది మల్లిక.

మాస్టారు మసులుతూ లేచారు. ఎవరూ కనబడలేదు. వెంకణ్ణి పిలిచి “మల్లిక వెళ్లిపోయిందా!” అన్నాడు.

వెంకడు ఆశ్చర్యంగా చూచాడు.

"కాని ఈశ్వరరెడ్డి తను కన్నది కలని అనుకోలేకపోయాడు. అదే అనుకుంటే వెంకణ్ణి అడిగేవాడు కాదేమో"

మల్లిక వచ్చిందని, ఆమెసౌందర్యానికి తనే పాత్రుడని, హృదయేశ్వరుడనని, యాజమాన్యం అంతా తనే చూసుకోవాలనని, నిర్ణయించుకున్నాడు. కరస్పర్శతోనే ఆమె పరిచితురాలయింది. సౌందర్య హృదయాన్ని రంజింపచేసింది. ఆశలు, అనుభూతులు, ఆమెను ఆభరణాలుగ అలంకరించి, మితిలేని ఆనందాన్ని చేకూర్చాలి. అనుకుంటూ హృదయంలో ఆరాధ్యదేవతగా, ఆరాధించాడు. ఆనందం కట్టలు తెంచుకు పోతుంటే; అరికట్టలేకపోతున్నాడు. ఊహాలు గానంచేస్తున్నాయి. ఈశ్వరరెడ్డి మధుతల మైకంలోనుండి విముక్తుడయినాడు.

వెంకడు స్నానానికి నీళ్లుతోడి, సోపుఅది సిద్ధంచేశాడు. అయ్యగారూ, స్నానానికి నీళ్లు తోడాను సోపుఅది సిద్ధంచేశా నీళ్లు చల్లారిపోతాయేమో! అన్నాడు. రెడ్డి శిరసావహించాడు. బాత్‌రూములోకెళ్లి స్నానం ముగించుకున్నాడు.

వెంకడు రేడియో బిగిన్‌చేసి, డ్రస్ సిద్ధంచేశాడు. కాఫీ, టిఫిన్ మామూలుగానే హాజరుచేసాడు. వాకిట్లో. బూట్లు చప్పుడయింది. వెంకడు ఆదుర్దాగా పరిశీలించాడు.

"అయ్యగారూ! మల్లికమ్మగారు ట్యూషన్‌కొచ్చారు" అన్నాడు.

ఈశ్వరరెడ్డి ముఖంలో చిరునవ్వులు చిందిపడ్డాయి." చెప్పరానివూహాలు అతన్ని ముంచివేస్తున్నాయి. తనకి తనే మర్చిపోతున్నాడు. వెంకడు సిద్ధంచేసిన డ్రస్‌తో టాయిలెట్ అయాడు.

ఆమె చూడకుండ తను ఆమెలోనికి చూచి నవ్వుకున్నాడు. తను అనుకున్నాడు. మల్లిక తన్నిచూడలేదని, ఆమె అలాగే వూహించుకుంది. కాని ఈశ్వరరెడ్డి ప్రవర్తన ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎల్లాంటికారణాలు లేకపోతే మాష్టారు అలా నవ్వుకోరు. గట్టికారణమే అయివుంటుంది. దానికి అతీతుడుగా వుండటం చాతకాలేదు; వెలిబుచ్చుకున్నాడు.

"ఆసమయంలో మాష్టర్ని పలుకరించడానికి కాని, అతనిలోకి చూడటానికి కాని, తనకి ధైర్యం లేకపోయింది.

ఎలాగైనా ఈశ్వరరెడ్డి చక్కనిరచయితని, కళాకారుడని, గ్రాడ్యుయేట్ అని, తనకి తెలిసేవుంది. కాలేజీలో "లెక్చరర్ గా" పనిచేస్తున్నాడు. యవ్వనం తొణికిసలాడుతుంది. మగువలపై మమకారాలు అతనిలో చిందులుతొక్కుతున్నై. వూహాలవత్తిడికి తాళలేక పోతున్నాడు. హృదయాన్ని రంజింపచేసే స్త్రీని, తనముందు నిలబెట్టుకొని, మమకారపు తెరలచాటున మగ్గిపోతూ, చిరునవ్వులు వొలకపోస్తున్నాడు అనుకుంది మల్లిక.

"………………"

"మల్లికా……! మగువహృదయం మందారపువ్వులాంటిది. వాడుకోవటం తెలియనప్పుడు, దానిశోభ మాయమైపోతుంది…. అంతేకదూ….? మల్లికా!" అన్నాడు ఈశ్వరరెడ్డి.

"ఇప్పుడు ఆవిషయంలోకి ఎందుకువెళ్ళారు మాష్టారూ? అంది తలెత్తకుండానే."

'ఎందుకేమి, మల్లికా! నాను మాట్లాడటం చాతకాదేమో! నీహృదయానికి నొప్పికలిగించాను. నువ్వెళ్లిపోతుంటే చూచి వూరుకున్నాను. తిరిగి నీయందు ఆదరణ చూపలేకపోయాను. అసమర్థుణ్ణి. అంతా నీప్రభావమే మల్లికా! అన్నాడు'

"మాష్టారుధోరణి మల్లిక్కి అంతుపట్టలేదు. స్తబ్ధురాలయిపోయింది."

"మల్లికా! నవల ఎల్లాగుంది?"అన్నాడు ఈశ్వరరెడ్డి పరిచయుడులాగ."

"నవలా! నవలేమిటి మాష్టారూ?"

"అట్లా ఆశ్చర్యంగా అడుగుతావు దేనికి మల్లికా! నేనిప్పటికే పిచ్చివాడినయ్యాను. నీసౌందర్యం, నీవిజ్ఞానం, నీలో దాగివున్న ఈకళాసంపద, నన్ను పిచ్చివాడిని చేసినై. నవల నీకిచ్చి దాని అవగాహనకూడా చేసుకోమని చెప్పాను. దాని పేరు "శబక" అంటారు….జ్ఞాపకంలేదా!

"మల్లిక సమాధానం చెప్పలేక వెళ్లిపోయింది.

……."మగవారిమనస్సు" అనుకుంటూ,"

## లోకం తీరు

ఆద్దేపల్లి లక్ష్మి

అవుననినా ఇదేగా
కాదనినా ఇదేగా
అవునో కాదో మరి చూచేవారెవరు?

కలిమిగలవానికే కాలం
బలిమిగలవానిదె రాజ్యం
ఇది ముమ్మాటికి న్యాయం
లేదేమాత్రం సందేహం !

నిరుపేదకు తననీడే ఆధారం
అతుకుల బ్రతుకే మహాభారం
ఈ యిలలో తన ఉనికే మహాఅపరాధం !

అవుననినా ఇదేగా
కాదనినా ఇదేగా
అవునో కాదో మరి
ఆలకించేదెవరు?

# శ్రీరామునితోఁ దాటక

## విద్వాన్ శ్రీ కనమలూరు శివరామయ్య-

సందర్భము :—

యజ్ఞసంరక్షణమునకై విశ్వామిత్రుఁడు దనవెంట రామలక్ష్మణులఁ గొంపోవుచున్నాఁడు. దారినడుమ అడవిలోఁ దాటక యెదురైనది. ఆమెంగూర్చి ముని రాజకుమారుల కెఱింగించి, సంహరింపుమని శ్రీ రాముని ప్రోత్సహించుచున్నాఁడు. ఆసమయమునఁ దాటక రామునితో నిట్లనుచున్నది.—

అన్నా పిన్నవు,లోకవృత్తములసుం
  తైనన్ విచారింప వీ
సన్నానుల్ వినిపించు ధర్మములు మో-
  సంబుల్ నిజంబంచు నీ
విన్నాణంబు దొఱంగి నాపయి వృథా
  ద్వేషంబుతో బాణముల్
గొన్నావా విడువంగ! మానఁగదె,
  యేలా కిన్క స్త్రీజాతిపైన్॥

ఈగాధేయుఁడు సత్తపోధనుఁడు గాఁ
  డెవ్వేళ ముక్కోపియౌ,
రాగంబున్ విడలేక కామినులకై
  ప్రాల్మాలు హింసారతిన్,
బాగోగుల్ గమనింపఁ డిద్దె నినుఁబం
  పంజంకు నీతండ్రి నె
న్నోగర్వోక్తులఁ దూలనాడె పరుల
  న్నొప్పింప మెప్పందునే!

నీకులగురు సుతానీకమ్ము నూర్వుర
  గసిమసంగినయట్టి కఠినుఁడితఁడు.
మునియను విశ్వాసమునఁ జెంతఁజేరిన
  మేనకఁగూడు నజ్ఞాని యితఁడు.
నిర్నిమిత్తమ సత్యనిధి హరిశ్చంద్రుని
  గష్టాలముంచిన కపటియితఁడు.
అట్టిట్టు గాకుండ నంతరిక్షానఁ ద్రి
  శంకు వ్రేలించిన పెంకె యితఁడు

ఒండు, పది, వంద లీతని దుండగములు
గడుసుసన్న్యాసి యీతని విడక నమ్మి
పాలవంటి కులమ్మును శాపములకుఁ
బాలుగాఁ జేయకుర సుగుణాలవాల!.

ఇట్టిగడిందిచెయ్దిమున
  కీవు దొడంగుట చూచిరేని "ఈ
బొట్టె కులక్రమాగత మపూర్వ
  మనింద్యము నైన కీర్తికిన్
గట్ట! మలీమసంబు నొడి
  గట్టెడు నిట్టిఁడు పుట్టనేమి! తాఁ
బుట్టకయున్న నే" మనుచుఁ బూర్వులు
  స్వర్గమునందుఁ గుందరే!

ఆడినమాటఁ గాదనలేక నీచమా
  నవసేవఁ బూనె భూధవుఁడొకండు,
తనమేనికండలఁ దఱిగి శ్యేనముఁ దన్పి
  పారావతముఁగాచె ప్రభుఁడొకండు.
కోపంబు శత్రువై తాపంబుఁగూర్చెడు
  నని మౌనికే నేర్పె నధిపుఁడొకఁడు.
భారతావనిఁ గడుఁ బావనిగాఁ జేసె
  మిన్నేటిఁదెచ్చి రామిన్న యొకఁడు.

ఇట్టి మహనీయులెందఱో పుట్టినట్టి
కుల మపఖ్యాతి పాల్సేయఁగోరి నిన్ను
మోసగించెడు, నీమునిముచ్చుమాట
వినకు బాణమ్మువిడువకు, విడువకయ్య!

చత్తునో! చావనో! తనదు
  శాపమునన్ శపియింపఁబూనఁ డీ
మత్తుఁడు చచ్చినన్ దనకు
  మానక పాతకమంటునంచు ని
న్నిత్తఱిఁ బ్రోత్సహించె, సమ
  యించితి వేనియు నీకె పాపముల్
హత్తగఁ గోర్కెదీర్చుకొను
  స్వార్థపరుండితఁడయ్య, బాలకా॥

"కులమర్యాదలు వీరధర్మములుఁదాఁ
  గొంతేనిఁ బాటింపకే
చెలులం గూలఁగనేయఁబూనె నితఁడా!
  ఛీ, ఛీ, మహాశూరుఁ డెం
దులకా నీయవినీతివిద్య" యని
  యెంతో నిన్నుదూషింతు రీ
యిల నీసాటి ధనుర్విదగ్రణులు సు
  మ్మీ సుంత యోజింపుమా!

రాజకులుఁడయ్యు, నితఁడధర్మప్రవృత్తిఁ
జెనటియైనాఁడు, వంశమే చెఱుపఁబూని
చేసె నీకుత్సితమ్ముఁ "దాఁజెడ్డకోఁతి
వనమునంతయుఁ జెఱచు"నన్ పలుకు వినమె॥

సందర్భము :—శ్రీరాముఁడు విశ్వామిత్రు నాజ్ఞానుసారము తాటకపై బాణప్రయోగము గావించెను. నారాచము రక్కసిహృదంతరమున నాటినది. తాటక యిట్లనుచున్నది :-

ఔరా! నావచనమ్ములన్ వినక దు
ర్వ్యాపారతన్ గ్రూరమౌ
నారాచమ్ము బ్రయోగమున్సలిపితే,
నాయక్కునన్ నెత్తురుల్
ధారాపాతములయ్యె, నారటముని
స్తంద్రంబు, నాప్రాణముల్
దూరంబౌ, నిఁక చత్తుఁగాని తుది ప
ల్కుల్ గొన్ని యాలింపుమా!

సతులం జంపినవాఁ డెవండయిన
రాజ్యభ్రష్టుఁడౌఁ, గానతే
గతియౌఁ, దండ్రియుఁజచ్చు నుగ్మలివియో
గమ్ముల్ సదాప్రాప్తమౌ,
సుతులుం దక్కరు సుమ్మి, యాఁడికలగుం.
జోద్యమ్ముగా వానికిన్
ఋతమౌ గాదె భవచ్చరిత్ర నిదియుర్విం బ్రాజ్ఞ
కానౌనన్

గేయకథానిక :

# రామరాజ్యం

మూలం : ఆంగ్లం, శ్రీ భైరవభట్ల రామబ్రహ్మశ్రీ అనువాదం : తెలుగు

భోగభాగ్యములెన్నొ హాయిగ
పొంది సతతవినోదములతో
అతివిలాసము లందు ధరణీ
పతిగలండొకచో !

రోగమేదో నన్ను పట్టుకు
లాగుచుండెను మంత్రులారా !
వైద్యులను సత్వరమె పిల్చుకు
వత్తురా మీరల్ !

పల్కెనిటు లోకనాథు భూపతి
పల్కువిని నంతటనె మంత్రుల్
వైద్యవర్యుల కొరకు బంపిరి
వారి గొని తేరన్

ఎవ్వరికి కనపడదు రోగ
మ్మేమి చేయను తోచకుండెను !
వచ్చెనంతట వైద్యుడొకడు ప
రీక్షచేయంగన్ !

రోగమెదియో ఉండె ననుచున్
రోగికిని మందిత్తుననియన్.
అధిక బీదతనమ్ము గల్గియు
నమిత సుఖమున బ్రతుకు మనుజుని
వెతకి యాతని చిరుగుచొక్కా
తొడగవలె ననియెన్ !

కరము రయమున రాజసేవకు
లురకలేయుచు పరుగులెత్తిరి
అరసిచూడగ నెందుకనరా
రతుల సుఖవంతుల్ !

సుతుడు మరణముజెందె నంచును
వెతలుచెందెడువారు కొందరు
భార్యపోరు భరింపలేకన్
వ్యథలు పడువారల్ !

రోజురోజుకు ప్రజలబాధలు
రాజు చెవిలో బడుచునుండెను
కరగిపోయెను రాజహృదయ
మ్మరసి కష్టాలన్ !

తప్పుజేసితి నంచు భూపతి
అప్పుడే గ్రహియించె నటుపై
ప్రజలహితవుకు పాటుపడు స
ద్భావ ముదయించెన్ !

నాటితోడ నశించె కష్టాల్
నాటినుండి సుఖాల జనముల్
హాయిగా వసియింపసాగిరి
అంది రానందం !

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రి వార్షికోత్సవోపాయనము :

# సంస్మరణము

## "ఏకాకి"

అనుగుందమ్ముల స్వేచ్ఛకోరి యసువుల్ చాలించి స్వర్గమ్ము జే
రిన శ్రీరామ! దయాభిరామ! నిను నర్థింతున్ స్వరాష్ట్రోత్సవ
మ్మును కావించెడు మాకు దీవనలతో మోదమ్ము చేకూర్చి ర
క్షనుకల్పింపగ, స్వీకరింపుము నమస్కారమ్ము లత్యాదృతిన్.

సుప్రతిష్ఠితమైన యాంధ్రప్రదేశ
రాష్ట్రివార్షికోత్సవ మభిరామఘణితి
జేయుచున్నా మహో! యశఃకాయ! నేడు.
భవదమోఘాశిషమ్మె మాబలిమి, కలిమి.

తెలుగుంగేతన మంబరమ్మున ప్రవర్తింప న్నిరాతంక ని
శ్చల నిర్వక్ర నిరస్త వైఖరుల, ఆశాసింపు, మోఅన్న పూ
ర్వుల ఔన్నత్యము సంభవించి జగతిన్ పూజ్యప్రతిష్ఠా గరి
ష్ఠులమౌనట్లు కృపాగుణప్రథితదృష్టుల్ మాపయిం జూపుమా!

ఆంధ్రు లారంభశూరులటన్న వాదు
మాసిపోయెను దేశాన వాసిపెరిగె;
నేత లఖిలభారతఖండ నేతలైరి!
నీదువాత్సల్య ఫలితమ్ము కాదె యిద్ది!?

అగ్రగణ్యులైన ఆంధ్రనాయకులెల్ల
రరుగుదెంచి రచట కమరజీవి!
మిగిలినాము మేము మిమ్ము స్మరించుచు
మాతృపూజ సలుప మధురహృదయ!!

---

## బాలల దినోత్సవం

'ఆంధ్ర మహిళాసభకు సంబంధించిన అడయారులోని నర్సింగుహోం బాలల దినోత్సవం శ్రీమతి-కందామాణిక్యాంబ భీమశంకరంగారి అగ్రాసనాధిపత్యం క్రింద జరుపబడింది. ఆమెగారికి నర్సింగుహోం కార్యదర్శిని శ్రీమతి హనుమంతరావు సుస్వాగతమిస్తూ, పరిచయవాక్యాలు పలికింది. కుటుంబ నియంత్రణలో తరబీతు పొందేవారు, బిడ్డల తల్లులకు అభ్యుదయం పొందదగిన శిశువులనుగూర్చి, 'నీ బిడ్డలు నీవు' అనే దాన్ని గూర్చి సంగ్రహంగా తెలిపారు. అదృష్టవంతమయిన బిడ్డ ఎన్నుకొటానికి కొన్ని బహుమతులను పంచిపెట్టేరు. డాక్టరు కమలా దేవిగారి వందన సర్పణతో ఉత్సవం సమాప్తి అయింది.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the Month of October, 1961.

**OUT-PATIENT REGISTER:—**

| | |
|---|---|
| No. of Medical cases treated | 673 |
| ,, ,, Surgical ,, ,, | 9 |
| ,, ,, Ante-natal ,, ,, | 270 |
| ,, ,, Post-natal ,, ,, | 55 |
| ,, ,, Gyneac ,, ,, | 98 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 25 |
| ,, ,, Dental ,, ,, | 1 |
| Total ,, ,, New Patients | 1131 |
| ,, ,, ,, Old ,, | 1130 |
| Grand Total | 2261 |

**ADMISSION REGISTER:—**

| | |
|---|---|
| No. of Patients admitted for Normal Deliveries | 152 |
| ,, ,, ,, ,, ,, Abnormal<br>Forceps -6<br>Ext. Breech-2 | 8 |
| ,, ,, Gyneac Cases Treated | 34 |
| ,, ,, Ante-natal cases c False pains | 22 |
| ,, ,, ,, ,, c Toxeamia | 8 |
| ,, ,, Surgical ,, | 1 |
| ,, ,, Medical ,, | 45 |
| ,, ,, Post-Natal ,, | 4 |
| ,, ,, Babies admitted as Lodgers | 153 |
| Grand Total | 427 |

(True Copy)

(Sd.) Dr. K. R. AMBUJA,
*Resident Medical Officer.*

(Sd.) Dr. M. PAVANA BAI,
*Medical Superintendent.*

Smt. V. LAKSHMI PARVATHI
*Secretary.*

# అనాఘ్రాత పుష్పాలు

## 'షాలీ'

సూర్యుడస్తమించాడు. పక్షులన్నీ తమతమ గూళ్ళను చేరుకున్నాయి. రైతులందరూ పగలంతా శ్రమ పట్టంచేత, ఏదో ఇంత తిని హాయిగా నిద్రిస్తున్నారు. రాను రాను చీకటి దట్టం కాసాగింది. ప్రశాంతనీరవ సమయం, కాని ఏదో గుడ్లగూబ శబ్దం వినవస్తూవుంది. ఆకాశ వీధిలో నక్షత్రాలు మాత్రం మినుకు మినుకు మంటూ ఏమిజరుగుతుందా యని కాచుక్కూర్చునట్టు మెరుస్తున్నాయి. వెంకయ్య తనయింటి వసారాలో కూర్చుని ఆలోచనా పరంపరంల్లో మునిగినట్లుంది. చుట్ట కాలుస్తున్నాడు. ఇంతలో భయంకరాకారంతో నిగనిగలాడేనల్లని వ్యక్తి తన బుగ్గమీసాల్ని వ్రేళ్ళతో సవరించుకుంటూ లోనికి వచ్చి, ఓరచూపుల్తో అతని కల్లంత దూరంతో నిలబడి "అయ్యా" అన్నాడు. వెంకయ్య కండ్లలో ఆశాజ్యోతి ప్రతిఫలించింది.

"ఏరా! జ్ఞాపకముందా? జాగ్రత్త! కార్యం సఫలమయిందా...." అంటూ రూపాయల సంచిని ఎత్తి చూపించాడు. ఇంతలో ఆ నల్లని ఆకారం చీకట్లోమాయమయింది.

వెంకయ్య ఇంటిని వదిలిన ఆ ఆకారం దాక్కుంటూ దాక్కుంటూ ఒక ఇంటిని సమీపించింది. అక్కడ అందర్లూ నిద్రాదేవత ఒడిలో విశ్రమిస్తున్నారు. ఒక ముసలతననుకుంటా నిద్రపోతూనే నవ్వుకుంటున్నాడు. పాపం అతడేం తియ్యని కలలు కంటున్నాడో!

ఆ యిల్లు అంతేం పెద్దదికాదు, సామాన్య గృహస్థునిదిలావుంది. కాని అందంగా అలంకరించివుంది. అదికూడా ఆ దినమే అలంకరించారేమో, ఆ ఆకారం ఇంటివెనక్కు పోయింది. అక్కడున్న చిన్నకిటికీని తననైపుణ్యంకొద్ది శబ్దంలేకుండా విరగ్గొట్టి లోనికి ప్రవేశించింది. అది పూజాగృహం. ఒకదీపం చిన్నగా వెలుగుతూ వుంది. చుట్టూ పటములలంకరించివున్నాయ్. ఆ ఆకారం అటుఇటు వెదుకుతూ ఓచిన్నపెట్టెవద్దకు పోయి దానిని తెరచి అందుల్లోంచి ఏవో తీసికొని మాయమయింది.

అమరనాథుడు ఉదయగిరిలో పేరుమోసిన అధ్యాపకుడు. లక్ష్మి అతనిఇల్లాలు. పొరపొచ్చాలులేని కూర్మితో ఆదంపతులు జీవయాత్రను సాగిస్తున్నారు. అమరనాథునకు నలుబదిఅయిదుసంవత్సరములు, జీవితవాసరమున సంధ్య సమీపించేసమయం. ఎన్నిజపతపము లాచరించినప్పటికి వారికి సంతులేదు. రోజులేమో ఒకటివెనుక ఒకటి దొర్లిపోతున్నాయి.

ఒకానొక పుణ్యదివసాన ఆ దంపతులిరువురు శారదామందిరమునకరగి అవికలమతిలో దేవిని పూజించి "దేవీ! మేము నిన్ను ఇరువదేండ్లుగా వంశాంకురమును ప్రసాదింప వేడుచుంటిమి, కాని మాప్రార్థనల నాలకించవైతివి. 'అపుత్రస్య గతిర్నాస్తి'యని వేదములుద్ఘోషించుట జగన్మాతవైన నీవెరుగనిదికాదు. నీవు సర్వశక్తిసమన్వితవు, భక్తవత్సలవు అయికూడా నీభక్తులిట్లు నిరాశతో క్రుంగిపోవుట చూచుచూ మిన్నకుండుట నీకు ధర్మమా?' యని ప్రార్థించిరి.

కొన్నిదినములకు వారికి శారదాదేవికటాక్షమున ఒక బాలిక జన్మించినది. ఆబాలికకు శారద యని నామకరణ మొసంగినారు. ఎట్టిదుర్ముహూర్తాన జన్మించెనో పాప మాబాలిక అపారదేవతయూ. అపారకరుణామయియూ, ప్రేమస్వరూపిణియూ నగు మాతృదేవత నెరుగనే ఎరుగదు. ఆమె జన్మదినమందే తల్లి పరలోకగతురాలయింది.

తరువాత అమరనాథుడు స్వగ్రామంలోనే నలుగురు పిల్లల్ని ప్రోగుచేకొని చదువుచెప్తూ తనఏకైకపుత్రికయునూ, ఆశాజ్యోతియునూ నైన శారదను అల్లారుముద్దుగా పెంచుచుండెను. అతనికి నివసింప ఇల్లుతప్ప ఇతరఆస్థి అంటూ ప్రత్యేకించి ఒకటీలేదు; కాని వున్న దానితో తృప్తిపడేరకం.

ఈవిధంగా పంద్రెండేండ్లు గడచినవి. శారద పెద్దదయింది. పసిపాపలాంటి ఆమె మనోహరమైనముఖమూ, అబలాజనోచితమగు భీతి అమాయికతతోగూడిన నిష్కలుషభావతీవ్రత వీటిని చూస్తే తియ్యనిభావలు మనోవీథిలో రేకెత్తేవి. ఆమెయపురూపసౌందర్యాన్ని చూచి ప్రతి ఒక్కరూ యెన్నోవిధాలుగా భ్రాంతిపడేవారు. అమరనాథుడు తఱచు కూతురువివాహవిషయమై ఒంటరిగా ఆలోచిస్తూవుండేవాడు.

ఒంటరితనం మానవుని మస్తిష్కాన్ని అనేక బలహీనతలకు గురిచేస్తుంది. రకరకాల ఆలోచనల్ని కల్పించి కలవరపరుస్తుంది, మేధావులు, మహామేధావులుకూడా ఈ ఒంటరితనానికి దాసులై తమఅస్తిత్వాన్ని కోల్పోయి, అయోమయపరిస్థితుల్లో పడిపోతారు. ఇదేవిధంగా అమరనాథునిమనస్సులో ఏవో అవ్యక్తబాధలు ప్రస్ఫుటం

కాజొచ్చినవి. ఇంకా శారద బాలికగానే వున్న ఎంతబావుం దేదో అని అమరనాథుడు తలపోసేవాడు.

ఆ వూరిలో కృష్ణశాస్త్రి సద్బ్రాహ్మణుడు. అతనికి అమరునకు మంచిస్నేహం వుండేది. అప్పుడప్పుడు శాస్త్రులు అతనిఇంటికి వచ్చేవాడు. ఈడొచ్చినపిల్ల యింటియందుండుట చూచి శాస్త్రి ఒకనాడు ఏదో సంబం ధాన్ని తీసుకొనివస్తాడు. అమరుడు వారిని ఉచితరీతిగా సత్కరిస్తాడు. పక్కింటిసుబ్బమ్మ శారదను అలంకరించి కూర్చోబెడుతుంది. సిగ్గుతో శారద తలవంచుకొనివుంది. వచ్చినపెండ్లిపెద్దలు, పెండ్లికూమారుడు శారదను చూస్తారు.

శారద శారదయే. ఆ నేత్రాంచలములలో దోబూచులాడు ఆచిరునవ్వుదొంతరలు, యత్కించిద్భావోత్కర్షకైన జాలువారు ఆకన్నీరు, ఆముఖమాధుర్యగరిమ, మాటి మాటికి విత్రస్తమగు ఆకేసరకాంచీదామము, నిత్యనూత నోల్లాసవిలాసితావయవభంగిమలు, అలవోకగ నెట్టివారి నైనా ఆకర్షింపగలవు. పెండ్లివారికి పిల్ల నచ్చింది.

"ఏమండి అమర్‌నాథ్‌గారు పిల్ల ముద్దుగావుంది. పిల్లవిషయం మాకిష్టమే కాని........" అన్నాడు పెండ్లి కుమారునితండ్రి వైకుంఠం.

(ఇంతలో శారదను లోనికి పిలుచుకొనిపోతారు.)

"ఆఁ........ ఏదోచెప్పండి. దాపరికమెందుకు?" అన్నాడు కృష్ణశాస్త్రి.

"నాకుమారుణ్ణి మూడువేలదాక ఖర్చుచేసి థర్డుఫారం చదివించాను, కట్నం........" అంటూ మాట చాలిం చాడు వైకుంఠం.

"బీదవాణ్ణి, మీకుతెలియందేముంది" అన్నాడు మరుడు.

వైకుంఠం కట్నంగా రెండువేలివ్వవలసిందని కోరు తాడు. అంత ఇవ్వలేనని, ఎట్లైనా ఈపరిస్థితుల్లో తనకు సహాయపడవలసినదిగా వైకుంఠం చేతులు పట్టుకొని వేడుకున్నాడు అమరనాథుడు. కాని ఆశిలానిర్మితహృద యమున కరుణ ఇసుమంతయునూ కలుగలేదు. రెండు వేలియ్యదలిస్తే మాట్లాడండి; లేకుంటే లేదన్నాడు వైకుంఠం.

ఈ దృశ్యాన్నంతా శారద తెరచాటునుంచి కండ్లారా చూచింది. ఆమె కోమలహృదయం దహించుకపోయింది. కండ్లలో నీరుతిరిగినవి. అమరనాథుడు మరలా ప్రాధే యపడటం మొదలుపెట్టినాడు. "చదివిన అల్లుడు దొరికితే మీకూతురే బాగుపడుతుంది. మాకేమన్నా పెడ్తారా? ఇవన్నీ కానిమాటలు అమర్‌నాథ్‌గారు" అన్న శబ్దం ఆమెకు మరలా వినబడింది. అవమానాన్నెరుగని కన్య కీదృశ్యం హీనంగా తోచింది. లోపలకు పోయి ఏడ్వ డం మొదలుపెట్టిం దా అమాయకపుబాల. రెండువేలిస్తే పెండ్లి, లేకుంటే లేదంటూ వైకుంఠం తనకుమారుణ్ణి వెంటిడుకొని వెళ్లిపోయాడు. అమరనాథునకు తలదీసి నట్లయింది. కాని ఏమిచేయగలుగుతాడు? జగతిలో కన్నియ నిచ్చువారు గౌరవహీనులే!

అసలు కత్తులకలువతోటలో తిరిగే తుమ్మెదలాం టిది కలిమి. పాలకడలినుండి పుట్టేటప్పుడే అందు లోంచి పుట్టిన పారిజాతపుచిగుళ్లలోని రాగాన్ని, నెల వంకలోని వక్రతనూ, ఉచ్చైశ్రవంనుండి చంచలతనూ, కాలకూటంలోంచి తెలివిని కోల్పోయే శక్తినీ, మదిర లోని మదాన్నీ, కౌస్తుభంలోని కాఠిన్యాన్ని తనలో మేళ వింపజేసుకొంది లక్ష్మి. అందుకే దీనంతచెడ్డదేలోకం లోనూ లేదన్నది. కళ్లు మూసుకున్నా కనబడేసత్యం. ఇదిదొరికినా కాపాడుకోడం కష్టమే. దొరక్కపోయినా దీనికోసం తపించేపోవడం కష్టమే. ఇది దొరికాక పోగొట్టుకున్నవాడు పడేబాధ ఆపరమాత్ముడైన వివ రించిచెప్పలేడు. ఇది కులాన్నీ, వంశాన్నీ, మంచినీ, నీతినీ, శీలాన్నీ, దేన్నీ లక్ష్యంచేయదు. కళ్లను కప్పి వేస్తుంది. మనిషిని మూర్ఖునిగా మార్చివేస్తుంది. గంధ ర్వులు సృష్టించే నగరంలా, ఈక్షణం కనబడి మరు క్షణంలో మాయమైపోతుంది. మందరం చిలుకుతున్న ప్పుడు ఆసుడిలోపడి గిరగిరతిరిగిన అలవాటు దాన్ని పట్టి విడిచిపెట్టలేదు. దానికాలు ఒకచోట నిలువదు. ఎంత లోభినైనా అది శ్రీమంతుణ్ణి వరిస్తుంది. వాణ్ణి పిశాచిగా మార్చివేస్తుంది. తమోగుణాన్ని వానిలో ప్రవేశపెట్టి పరులచే అసహ్యించుకొనే పిశాచిలా చేస్తుంది. ఇది పైకి మనిషిని ఉన్నతునిగా చూపుతుంది. నీచత్వాన్ని లోన ప్రవేశపెట్టుంది. జలనిధిలో పుట్టినా, దాహాన్ని పెంచుతుంది. బలవంతుణ్ణయినా తేలికను చేస్తుంది. నిర్మలుడుగా కనబడేలా చేసి, వానిహృద యాన్ని మాలిన్యాన్ని చేస్తుంది. ఒకమాటలో చెప్పాలంటే, మానవపిశాచానికి పాడుకొంప 'క్రోధమకరాలకుమడుగు' విషక్రిములకిది పానశాల. దోషసర్పాలకిది పుట్ట. శాస్త్ర జ్ఞానానికిది చీకటికుతారం. మానవునిమధ్య మానవుణ్ణి వేరుచేసే మేరుపర్వతం.

నాటినుండి అమరునకు కూతురి వివాహం తీరని సమస్య అయింది. ఎంత తరచిచూచినా అంత అగాధం కాజొచ్చింది. ఎటుపోయి ఎటుచూచినా ప్రతివాకిటా కట్నం! కట్నం! అనే భీకరాట్టహాసాలే మారుమ్రోగాయి. అదీ తక్కువనా? వేలపై పయనం జరుగుతుంది. ఏంచేస్తాడు? చేయడానికి పనిలేక, తినడానికి తిండిలేక, కట్టడానికి బట్టలేక, ఆత్మాభిమానాన్ని చంపుకొని, అవినీతిని అవలంబించలేక ఆకలితో గుటకలు మ్రింగుతూ నిండు ప్రాణాల్ని దరిద్రదేవతకు నివాళిచేస్తూ జీవితంమీద లోకంమీద అసహ్యంకలిగి విరక్తిపుట్టి ఎంతోమంది పేదలు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అదేఅవస్థ పట్టింది, అమరునక్కూడ. పూటగడవటమే కష్టమైతే పైన పెళ్ళిళ్ళు, పేరంటాలు! కాని అట్లని ఈడొచ్చిన పిల్లను ఇంట్లో వుంచుకుంటాడా? అసలు సుఖసౌఖ్యాలు, భోగవిలాసాలు, శాంతి సౌభాగ్యాలు లభించేవి స్వల్పసంఖ్యాకులకే. బహుసంఖ్యాకమైన ప్రజానీకం కష్టాలతోనూ, దుఃఖంతోనూ అశాంతితోను పీడింపబడి క్రుంగి కృశించి పోతూంది.

ఆ గ్రామంలో వెంకయ్య మంచి ధనికుడు. వయస్సు 40 సంవత్సరాలు. కొన్ని నెలలక్రితమే అతని భార్య మరణించింది. ఒకనాడు శారద నీరు చేదుచుండగాచూచి ఆమెను తనదానిగా చేసికోదలిచాడా వెర్రివెంకయ్య.

మరునాడు వెంకయ్య తమ యింటి పురోహితుణ్ణి అమరనాథుని ఇంటికి పెండ్లి సంబంధవిషయమై రాయబార మంపాడు. ఎన్నికష్టాల్నయినా సహించి తనకూతురు నొక మంచియింటిదానిగా చేయదలిచిన అమరనాథునకిది పుండుపై బొబ్బలేచినయట్లైనది. ఇట్టి యనుచిత సంబంధానికి రాయబారిగా వచ్చిన పురోహితుణ్ణి నానా చీవాట్లు పెట్టి వెనుకకు పంపుతాడు. పురోహితుడు దండతాడిత భుజంగమువలె బుసకొట్టుచూ పోయి వెంకయ్యతో వున్నవికొన్ని లేనివికొన్ని కల్పించి చెప్పాడు. వెంకయ్యకు అమరనాథుని వ్యవహారంపై కోపంవచ్చింది. అప్పటినుంచి ప్రతీకారానికై వేచియున్నాడు.

ఒకరోజు కృష్ణశాస్త్రి సహాయంతో ఇంటిని కుదవబెట్టి రెండువేలరూపాయ లప్పుగా తెస్తాడు అమరుడు. ఇలాంటి అమూల్య సహాయాన్నొసగినందుకు కృష్ణశాస్త్రికి, దీన్ని అనుకూలింప చేసిన ఆ భగవంతునికి వేయిదండాలు పెట్టుకున్నాడతను.

ఆ మరునాడే తన స్నేహితుణ్ణి వెంటనిడుకొని వైకుంఠంగారి ఇంటికి వెళ్ళి సంబంధాన్ని కుదిర్చి దగ్గర్లోనే ముహూర్తాన్నికూడా నిశ్చయించుకొని కట్నాన్ని పెండ్లిపీటలపై ఇచ్చేటట్లు వప్పించుకొని వచ్చాడుకూడా.

అమరనాథుడిగారింట్లో వివాహం వైభవంగా జరుగుతోంది. ఇంటిముంగిట మామిడాకుల పచ్చనితోరణాలు, రంగురంగుల కాగితాల అలంకరణలతో చూడ ముచ్చటగా వుందావివాహగృహం, మంగళవాయిద్యాలు మిన్నుముట్టుతున్నాయి. రంగురంగుల చీరలతో చంటిపిల్లల అల్లర్లతో కూడిన కోలాహలంతో వాతావరణం మరింత శోభిస్తూంది. కన్యాదాత అమరనాథుడు మగపెళ్ళివారి సదుపాయాల్లో ఏలోటువస్తుందో, అన్న భయంతో తడబడుతూ హడావిడిగా తిరుగుతున్నాడు. లగ్నసమయం సమీపించింది, ముహూర్తం తెల్లవారుఝామున నాలుగున్నర గంటలకు, పురోహితుని మంత్రోచ్చారణలతో వివాహవేదికంతా మ్రోగుతున్నది. ఖరీదైన చీరలలో కన్యలూ, ప్రౌఢలూ ఇంకా ముదుసలి ముత్తయిదువలూ సంతోషంగా వుంటూ గుసగుసలూ పకపకలూ పోతున్నారు. ఆనందోత్సాహాలలో సహజభావానుభూతుల మరుగుపరచు పెండ్లికూతురు చూడ ఎంతో ముచ్చటగా వుంది, ఆనాడు జరిగిన సింగారమామె అందాన్ని ద్విగుణీకృతం చేశాయి. వధూవరుల జంట చిలుకా గోరింకల్లా వుంది.

ఇంతలో పెండ్లికుమారుని తండ్రి వైకుంఠం కట్నం ఇమ్మన్నాడు. అమరనాథుడు డబ్బుతేవడానికి లోనికి పోయి పెట్టెతెరచి వుండటాన్ని చూసి కంగారుగాఅటూ ఇటూ చూడసాగినాడు. కాని డబ్బు కనబడలేదు. పందిట్లో గుసగుసలు బయలుదేరినాయి. కొంచంసేపులో కోలాహలం ఎక్కువయింది. వైకుంఠం డబ్బు తన చేతికివ్వందే, తాళికట్టడానికి వీలులేదన్నాడు. అమరనాథుడు తనకి కలిగిన దురదృష్టాన్నిగూర్చి చెప్పుకొనగా వైకుంఠం కోపంతో మండిపోతూ, 'ఛీ దూరంగావుండు; ఏదో పెద్దగా ఇస్తానని డంబాలు పలికి తీరా సమయానికి ఈ విధంగా చేస్తావా? నీవు పిల్లనుగన్నది వూరిపైబడానికేనా? ఛీ, నీగడప త్రొక్కటమే పొరపాటు' అని పెళ్లిపీటలనుంచి తన కుమారుణ్ణి లాక్కుపోతాడు. అప్పుడా వివాహగృహం వివాదగృహంగా మారి తుదకు విషాదావృతమౌతుంది.

దీన్నంతా చూచి శారద నిలిచినచోటనే స్తంభీభూత ఐనది. వాతాహతిజలించు లలితలతా పల్లవమువోలె కంపించినది. మోడువారినది. అనిమిషలోచనయై గజ

గజ వణకినది. కోమలకరపల్లవముల, అరుణాధరములు చలించుచేగాక నిస్తేజములైనవి. అక్కడ ఒక్కక్షణం కూడ వుండలేక పోయింది. అమరుడీసంఘటన జూచి నిశ్చేతను డయ్యాడు.

శారద అక్కడనుంచి లేచి పూజా గృహంలోనికి పారిపోయింది. మానముపోయిన తరువాత, ప్రాణమెందుకని తన దురదృష్టాన్ని నిందిస్తూ తల్లిపటంవద్ద నిలిచి భోరున యేడ్వసాగింది. ఆమె చెవుల్లో వైకుంఠంగారి మాటలే ప్రతిధ్వనిస్తున్నాయ్. ఆమె కండ్లయెదుట తన తండ్రి దీనావస్థ మెదలసాగింది. ఇక తన తండ్రిని కష్టపెట్టకూడదనుకుని తన తల్లివద్దకు పోవడానికై నిశ్చయించుకుం దామాయకపుబాల.

ప్రశాంతంగా వెలుగుతున్న దీపకళికపై తన పవిట కొంగును పెట్టింది. చూస్తూచూస్తూ అగ్నిప్రజ్వరిల్లింది. అందరిదృష్టి దానిపై పడింది. కాని మించిపోయింది. కర్పూరదీపం క్షణంలో నశించిపోయింది. నట్టనడిగగన మార్గంలో సూర్యుడస్తమించాడు. శారద యౌవ్వనము, సౌభాగ్యము, అందమూ అంతయూ ఆ అగ్నిజ్వాలలో పడి దహించుకుపోయినాయి. మృత్యుదేవతకూడ దీన్నిచూసి పశ్చాత్తాపపడసాగింది. ఆమె ప్రాణజ్యోతి యీ యాతనా ప్రపంచం వీడి అనంతాకాశపథంలో కలిసింది. ఇక ఆమె కష్టాలు తీరినాయి. పాపిష్టిమానవులకిక ఆమె కనపడదు— పడదు. పడదు.

---

మూలం : శ్రీ దేశాయి. స్వేచ్ఛా అనువాదం : శ్రీమతి సోమేపల్లి శారదాదేవి, కదిరి.

# దాంపత్య జీవితమును సుఖముగ గడుపుటెట్లు?

శ్రీమతి సోమేపల్లిశారదాదేవి.

మనదేశమున చాలమంది దంపతులు తృప్తితో సుఖజీవనము చేయుచుండునట్లు కనిపింతురు. కాని వీరిలో ఎందరు యితరులను మభ్యపెట్టుటకు తాము సుఖముగనున్నట్లు బయటికి నటించుచుండుటలేదు? ఎందరిదాంపత్యజీవితములు గృహకలహముల వల్ల మదనపడుచు, పరస్పరద్వేషభావములతో మెలగుచున్నారోగద! వివాహబంధమువల్ల ఒకేయింటిలో నివసించుట తప్పదు. గనుక నిర్బంధముగ దాంపత్యజీవితమును గడుపుచున్నారు. వీరిని గృహపరిస్థితులు, కుటుంబసాంప్రదాయములు, సాంఘికకట్టుబాట్లు, సంతానభవిష్యత్తు మొదలయినవి ఈరీతిగ బంధించి యుంచకపోయినచో ఎప్పుడో విడిపోవువారు. వీరిదశ దయనీయము, దుఃఖభాజనము.

పూర్వమునుండి చాలహైందవేతర జాతులలోను కొన్ని హైందవజాతులలోను విడాకులిచ్చుకొనుపద్ధతి అమలులో నుండినది. ఇటీవల ఈపద్ధతిని చట్టరూపమున అన్నిజాతులవారికి వర్తింపజేసినారు. ఈవిడాకులు కోరువారిలో, ఆదర్శప్రేమ, ప్రేమవివాహములు అని ప్రచారముచేసికొని అభ్యుదయభావములు, తగినంతవిద్య కలిగి వివాహమాడిన యువతీయువకులే, ఎక్కువగ నున్నారు. ఇట్టివారిజీవితములు సుఖముగలేవనుటకు తరచు జరుగుచున్న యువతుల ఆత్మహత్యలే సాక్ష్యములు. ఇది ఎంతబాధాకరము? ఎంతగర్హ్యము?

ఈగృహచ్ఛిద్రములను అశాంతిని భార్యాభర్తలు యుక్తితో, వివేకముతో ఓర్పుతో వర్తించిన నివారింపవచ్చుగదా! ఒకరి నొకరు బాగుగ అర్థముచేసికొని అనుకూలముగ వ్యవహరించిన అసలు విభేదములకే తావుండదుగదా!

సంఘమున కలిగిన మార్పులు :— అనాదిగ మనదేశమున అనేకజాతులలో బాల్యవివాహములు సాంప్రదాయముగ నుండెడివి. పిల్లలు బాల్యమునుండియె తమకు ఫలానావ్యక్తి జీవితభాగస్వామిగ నిర్ణయింపబడినాడని తెలిసికొని అతనియెడ,లేక యామెయెడ ఎడతెగనిప్రేమానురాగములను కలిగించుకొనుచుండువారు. ఆత్మీయత బంధుప్రేమవృద్ధి చెందుచుండెడివి. అందువల్లవారు సుఖముగ భావిజీవితమును గడుపుచుండెడివారు. అయినను అప్పుడుగూడ అక్కడక్కడ గృహచ్ఛిద్రముల, అసంతృప్తి కలిగినవారు లేకపోలేదు. నేటివలె అంతయధికముగ లేదనుట సత్యము.

నేటి బాలబాలికలలో విద్యావిజ్ఞానములు ఎక్కువగుటతో వారిలో కొన్నిస్వతంత్రభావములు అంకురించుచున్నవి. దానివల్ల తమకు తగినవరుని లేక వధువును

నిర్ణయించుకొనుటకు, ఎన్నుకొనుటకు తమకు స్వేచ్ఛ కలదని భావింతురు. అంతేగాక సహవిద్య (Co-education) బాలబాలికలను పాఠశాలలలోను, కళాశాలలలోను సన్నిహితులను జేయుచున్నది. మరియు కచేరీలలోను కార్మాగారములలోను ఉద్యోగరీత్యా స్త్రీ పురుషులు ఒకచోటనే పనిచేసి పరిచయముల నేర్పరచుకొను అవకాశములు కలుగుచున్నవి. ఇట్లు యువతీయువకులకు సాహచర్యము, సాన్నిహిత్యము ఏర్పడి వారియందు కొన్నిసందర్భములలో ప్రేమభావము కలిగి వివాహమునకు దారితీయుచుండును. వివాహాత్పూర్వము వారు పరస్పరాపేక్షతో వర్తింతురు. దీనినే పాశ్చాత్యులు (Court ship) అందురు. అప్పుడు వేషభాషలలోను, ప్రవర్తనలోను ఒకరినొకరు ఆకర్షించుటకు ప్రయత్నింతురు. స్త్రీ తనప్రేమికుని హృదయమందిరములో దాచుకొని పూజించును. పురుషుడుగూడ అట్లే భావించుకొనును. కాని వివాహానంతరము వీరిసహజస్వభావముల యందలి లోటుపాట్లు వ్యక్తమయి, ఆదర్శప్రేమయందలి బండారము బయటపడును, మనఃప్రవృత్తులు అలవాట్లు విరుద్ధములైనపుడు వారిదాంపత్యజీవితములో కలతలు బయలుదేరును. తమ ఊహానిర్మిత స్వర్గహర్మ్యములు కూలిపోవ నారంభించును. ప్రతిజీవికిని కొన్నినియమములు అలవాట్లు వుండును. ఇవి మరియొకరికి నచ్చకపోవచ్చును. వాటిని మార్చుటకు ప్రయత్నించడమువల్ల ఫలితము లేకపోగా, అసంతృప్తి, నిస్పృహ కలుగును. ఇట్టిసమయములలోనే దంపతులు ఓర్మిని సమయజ్ఞతను, యుక్తిని ప్రదర్శించి పరిస్థితుల కనుగుణ్యముగ నడచుకొన్నచో వారిజీవితములు సుఖమయముగ జరుగును.

అందువల్లనే సంసారము నౌకసాగరముగాను, జీవితము నౌకనావగాను, దానిని నడిపించునావికులు భార్యాభర్తలు లేక యింటియజమాని, యజమానురాలుగను పేర్కొనుచున్నారు. సాగరము ఎప్పుడూ ప్రశాంతముగ నుండదు. అక్కడక్కడ పెనుతుపానులు, పర్వతములు ఎదురై నౌకను ప్రమాదమునకు గురిచేయవచ్చును. అప్పుడు నావికులు సమర్థతతో వర్తించి నౌకను నడిపి గమ్యస్థానమును చేర్చవలెను. వారు తమ భద్రతకేగాక నౌకలోని ఇతరవ్యక్తుల జీవితములకుగూడ బాధ్యులగుచున్నారు. గనుక వారు కడుజాగరూకులై వర్తించుట యవసరము. లేనిచో కుటుంబములోని యితరవ్యక్తులు గూడ నాశనమగుదురు.

భగవంతుడు భార్యభర్తలను సంతానవంతులుగ జేయుటయేగాక, వారియందు పరస్పర అనురాగము, మనోవికాసము కలిగించి, జీవితమును మధురముగాను సుఖవంతముగాను జేయును. భార్యభర్తలు సహచరులై కష్టసుఖములను పంచుకోవలెను. ఉత్సాహముతోను, సంతృప్తితోను మెలగవలెను. అప్పుడే వారి మధురస్వప్నములు ఫలించును. "నిజమైనప్రేమ ఎప్పుడూ కష్టములను కొనితెచ్చును." తాత్కాలికముగ కలుగు అంతరాయములను, కలతలను, అభిప్రాయభేదములను సరకుగొనక ఓర్పుతో వ్యవహరించినచో వైవాహికజీవితము సరళముగ గడచును.

గృహావసరవస్తువులను గడించుట భర్తపని. గృహనిర్వహణము భార్యపని. ఇంటిని తీర్చిదిద్ది భర్తపాలిట్ల విశ్రాంతిని స్థిరముగ కలిగించవలెను. బయటపనివలన అలసిపోయి, ఎప్పుడు యిల్లుచేరుకొని హాయి ననుభవింతునా యనుభావమును కలిగింపవలెను. భార్య ఎదురువచ్చి చిరునవ్వుతో ఆహ్వానించినంతనే అతనిబాధలన్నియు తొలగిపోయి స్నేహభావము కలుగును. ఇంటి యజమానురాలుగా నేకాక తనకు సహధర్మచారిణిగను, సహాయకురాలుగాను ఎంచుకొనును. భార్యసాహచర్యమే భర్త అభీష్టము. ఇదియే దాంపత్యజీవితరహస్యము.

అందువల్లనే చార్లెస్‌పర్కిన్స్ అను విజ్ఞుడు "గృహమనగ అలంకరణతో నిండిన నాలుగుగోడల గదిమాత్రమే కాదు. పురుషుని మమకారమును అనురాగమును పొందిన హృదయములను పదిలపరచుకొన్న దేవాలయము." అన్నాడు.

తరతరములుగ (Generation) యువతీయువకులను శాశ్వతవివాహబంధముల జిక్కి పరస్పర లైంగిక సంయోగమును పొందుచున్నారు. గనుక మానవులలో దాంపత్యజీవితముయొక్క అవసర ప్రాముఖ్యము పెరుగుచున్నది. ఇట్లు వీరు దంపతులగుటకుముందు ఒకరిని గూర్చి మరొకరు తెలిసికొన నభిలషించుట సహజము. కేవలము గ్రుడ్డిగ వివాహమాడుటలేదు. "స్త్రీ ఉదారుడైనభర్తను పొందుటతో తృప్తిచెందుటలేదు. అట్లే పురుషుడు శాంతికామినిని భార్యగ పొందినంతమాత్రమున సంతుష్టిచెందడు'' అన్నాడు పర్కిన్స్.

వీలరు విల్ కాక్స్ అను ఆంగ్లేయుడు:— "ప్రేమకోసమై పరిణయమాడిన పురుషుడు ప్రజ్ఞాశాలిగాడు, ప్రేమలేని పురుషుని పడతులు పరిత్యజింపవలెను. ప్రేమ, గౌరవము రెండును మిళితమైయున్న

పరిణయము పవిత్రముగను, దైవికముగను నుండును. వీటిరెంటిలో ఏది లోపించినను విధి శోభనపురాత్రుల సౌఖ్యమునుండి వంచించి. జీవితము నంధకారముగజేసి వ్యథలపాలు జేయును. స్త్రీయొక్క కోమలస్వభావమును కలచివైచి అశాంతిని రేకెత్తించును" అన్నాడు.

గనుక ప్రేమ. పరస్పరగౌరవభావముగల దాంపత్యము ఆదర్శవంతము, ఆనందదాయకముగ నుండునని నిర్ణయించినారు.

"స్త్రీ ఎప్పుడుకాని తన తాహతుకు ఆదాయమునకు మించి ఖర్చుచేయు పురుషుని చేపట్టరాదు. ఇది చాల పెద్దపొరపాటు. ఇటువంటిభర్త కేవలము భోగలాలసుడుమాత్రమే. ఇంటియవసరములను తీర్చువాడుకాడు. తనసంతోషముకొరకు భార్య నొకవిలాసవస్తువుగ నుపయోగించుకొని యవసరము తీరినవెంటనే దూరముగ నుంచును. అట్టిస్త్రీ రాత్రింబవళ్ళు నిద్రాహారములు మాని యతని సేవయందే చెమటోడ్చి శ్రమించుచేగాక యతని భోగవిలాసములకు బలి గావలసివచ్చును" అని వచించినాడు బర్నహార్ట్.

సంసారమును చక్కబరచుకొని సుఖముగ జీవించుటకు అనుసరింపదగిన మార్గములు:—

స్త్రీలకు:—

(1 నీవు ధనికుటుంబమునకు చెందిన బాలికవైనచో, నీవుపయోగించుట కలవరచుకొన్న విలాసజీవితావసరవస్తువులు నీభర్త సమకూర్చలేకపోయినచో. నీవతని పరిస్థితులను గమనించి అర్థముచేసికొని సరిపెట్టుకోవలెను. నీఅలవాట్లను మార్చుకొని నడుచుకోవలెను. అతనిని బాధించి అప్పులపాలు చేయరాదు. నీవు ప్రేమించు వ్యక్తియొక్క మేలు కోరుదానివైనచో ఈఅంశమును ముఖ్యముగ జ్ఞాపకముంచు కొనవలెను. అప్పుచేయుట వల్ల తాత్కాలికయిబ్బందులు తొలగినవని సంతసింపకుము. ఋణబాధ భరింపరానిది. మనిషిని మానసికముగ క్రుంగదీసి సుఖము లేకుండచేయును.

2. అత్తగారితో అరమరికలు లేకుండ మెలగవలెను. వారికంటె అధికురాలుగగాని గర్వముతో గాని వర్తింపరాదు. అట్లు నడచుకొన్నచో వారిప్రేమకు విశ్వాసమునకు పాత్రురాలవై గౌరవింపబడుదువు.

నీవు బీద కుటుంబమునుండి ధనిక సంసారములోనికి వచ్చినచో వారి మర్యాదల ననుసరించుచు నీ పూర్వ స్థితిని మరువకుము. ధనము తుచ్ఛమైనది. నీ తలిదండ్రులను, అన్నదమ్ములను వారి కష్టసుఖములను విస్మరింపకుము. నీ నూతన జీవితమును జూచుకొని గర్వింపకుము. విలాస వినోదము లందును, సాంఘిక కార్యకలాపములలోను పాల్గొనుచు నీ యింటిని భర్తను మరువకుము. ఉపేక్షచేయవద్దు. సాంఘిక కార్య కలాపములలో పాల్గొనుట యవసరమే; దానివల్ల ఉత్సాహము, చైతన్యము యినుమడించును. భర్తతో వానినిగూర్చి మాట్లాడుటకు విషయము లభించును. ప్రతి పురుషుడు తన ప్రేయసితో సంభాషింప నభిలషించును గదా! మరియు తన భార్యకు సంఘములోగల మర్యాదను స్థానమును తెలిసికొని సంతోష పడును.

3. భర్త ఆదాయమునకు చేదోడు వాదోడుగ గడించుటకుగాని, ఉద్యోగముకై బయట పోవలసినప్పుడుగాని, నీ భర్త సేవకు, గృహకృత్యములకు ఆటంకముకలుగని వేళలను ఎన్నుకోవలెను. భర్తసాహచర్యమునకు భంగము కలుగరాదు. ఈ చర్యయే అనేకమంది జీవితములో అశాంతిని కలుగజేసి దాంపత్యములను చెరచుటకు కారణమగుచున్నది. దుస్తులు, గృహ నిర్వహణము శుభ్రముగను ఆకర్షణీయముగను నుంచవలెను. నీ స్థితికి తగిన దుస్తుల ధరింపవలెను. విలువైన వస్త్ర భూషణములు ధరించుటలోనే అందము, ఆకర్షణ వున్నదని భావింపకుము. ఇది యవివేకము. నల్లరాతి విగ్రహమున కెన్ని బంగారు నగలు పెట్టిన యందము కలుగును? మేలిమిగల విగ్రహమును కడిగి గుడ్డతో తుడిచినమాత్రముననే నిగనిగ మెరయుచు జీవకళ యుట్టిపడుచుండును గదా! అందము ఆభరణములలో లేదు. పుట్టుఛాయలేనిది పెట్టుఛాయ కలుగునా? గనుక సరళజీవనమే సౌఖ్యదాయకము చక్కనిదేహము, ఆరోగ్యవంతమైన జీవితములే స్త్రీ పురుషుల యైశ్వర్యము.

సంతానమును శుభ్రముగను, ఆరోగ్యవంతముగను సరియైన నడవడిక కలదిగను జేయుట నీవిధి. నీ భర్త యిష్టాయిష్టములు, బాగుగ తెలిసికొని వర్తించినచో అతని పాలిట గృహమొక స్వర్గముగ ఏర్పడి, సినిమాలు, క్లబ్బులు, స్నేహితుల వెంబడి తానై పోడు. అతని కిష్టమైన పదార్థములను వండి వడ్డించిన సంతుష్టుడై భార్యయెడల అనురక్తుడగును. శ్యాముల్ జాన్సన్ "పురుషుడు తన భార్య గ్రీకుభాషా నైపుణ్యము విని సంతోషించుటకంటె, బల్లమీద తనకిష్టమైన భోజ

పదార్థములు వడ్డించిన ఎక్కువ సంతోషించును" అన్నాడు.

నీ భర్త బంధువులను స్నేహితులను చిరునవ్వుతో ఆహ్వానించి వారికి తగిన మర్యాద చేయవలెను. దీని వల్ల భర్తకు సంతోషము కలుగుటయేగాక అతని గౌరవము పెరుగును. వారు అతని నభినందించి నీ మంచి తనమును కొనియాడుదురు. నీ భర్త పనియందలసి పోయి యింటికి వచ్చిన వెంటనే, పిల్లలపైన చాడీల చెప్పిగాని, యింటిలోని లోపములను తెలియజేసిగాని విసిగించవద్దు. తక్షణం ఖర్చువెచ్చముల వివరించి అవసర వస్తువులకై బజారు కురికించకుము. కొంచెము విశ్రాంతి పొందిన తరువాత నెమ్మదిగ తెలియజేయవలెను. అప్పుడు అతడు నీవు చెప్పిన విషయములను అర్థము జేసికొని పరిష్కారమార్గ మాలోచించును. ఉత్సాహముతో ముందు కార్యములు చేయును. అతని యలసటను, విసుగును కనిపెట్టి సానుభూతితో వర్తించవలెను. అనవసరపు వాదోపవాదములు చేయరాదు. మౌనము వహించిన యప్పటి వాదకారణము మరచి పోవీలగును. అందుకే "మౌనము, లజ్జ, స్త్రీలకు పెట్టని సొమ్ము"లని నాడు యూరకైడ్స్.

భర్త యెదుట యితర పురుషులను పొగడి యతనిని కించపరచవద్దు. ఇది చాల కీడుచేయును. నీ భర్త నీ యెడల విరక్తి చెంది పరస్త్రీల వ్యామోహములో పడును. మరియు గడచిపోయినతప్పులను పొరపాట్లను, దుస్సంఘటనలను నీ భర్తకు మరల జ్ఞాపకముచేయకుము. వానిని మరచుటకు నీభర్త నీనుండి దూర మగుటయేగాక కొన్ని వేళలలో త్రాగుడుకుగూడ అలవాటు పడవచ్చును.

చీటికిమాటికి కన్నీరు కార్చుచుండకుము. ఇది పురుషునికి చాల అశాంతిని కలిగించును. "పురుషుడు తన భార్య ఏడ్చుచుండుట రెండుమూడుసార్లు చూచెనేని, అతనిహృదయము ద్రవింపదుగాని తాను యింటినుండి కదలిపోవుటకు ప్రయత్నించును" అన్నాడు రోలాండ్స్.

ఎల్లప్పుడు, ఆరోగ్యముగ చిరునవ్వుతోను ఉండుటకు ప్రయత్నింపుము. భర్తసానుభూతి సంపాదించుటకుగాని, పనినుండి తప్పించుటకుగాని జబ్బుగ నుండువానివలె నటింపకుము. అది రానురాను అలవాటుగ పరిణమించి నీనాశమునకు దారితీయును. నీ అనారోగ్యము ఎడతెగనిదిగ పరిణమించినచో గృహమునందు అశాంతిని రేకెత్తించి భర్తకు కష్టమును కలిగించును. విధినిర్ణయమున కెవ్వరు బాధ్యులుగారు. కానీ మనమై తెచ్చిపెట్టుకొన్నచో అది దుఃఖహేతువగును. గనుక సాధ్యమైనంతవరకు ఆరోగ్యమును కాపాడుకొనవలెను.

ఎప్పుడు గంగిరెద్దువలె నీభర్త చెప్పినదానికి తలూపుచుండరాదు. సరియైనవిషయములు గానిచో వ్యతిరేకించుచూ ఉపాయముగ అతని ఉద్దేశ్యములను మార్చుచుండవలెను ప్రణయకలహములు జరుగుచుండిననే దాంపత్యపు మధురజీవనపు టనుభవములు తెలిసివచ్చును.

మన పెద్దలు భార్య :— కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ భుక్తేషు మాతా, శయనేషు వేశ్యా." అన్నారు.

దాసీజనులు యజమాని దండించునసుభయముతో ఎట్లు పనులను శ్రద్ధగ నిర్వహింతురో, అట్లే భార్య గృహకృత్యములను శ్రద్ధతో చేయవలెను. భర్తకు తగిన యాలోచన చెప్పవలెను. అభిరుచులెరింగి భోజనమును రుచ్యముగ వండి కడుపునిండుగ పెట్టవలెను. వేశ్యవలె శయ్యాసుఖము నొసంగవలెను.

మరియు— అత్తమామలందు యాదరంబునుజూపి
భర్తయందు మిగుల భక్తి గలిగి.
పుత్రులందు చాలప్రేమతో వర్తింప
ముక్తికలుగు వినుడి ముదితలార!
పురుషులు వర్తింపవలసిన విధము.

నీభార్యను సహధర్మచారిణిగను, సహాయకురాలుగను నీకష్టసుఖములలో భాగస్వామినిగను ఎంచుకొనుము. కేవలము పనికత్తె, విధేయురాలుగా భావింపకుము. ఆమెకును వ్యక్తిత్వము, స్వతంత్రభావములు, అభిరుచులు, ఆదర్శములు కలవని మరువవద్దు. ఆమె విషయములను శ్రద్ధగ వినుము. తగినరీతి పరిష్కరింపుము. నీజీవితసౌఖ్యము ఆమెప్రవర్తనపై ఆధారపడి యుండునని విశ్వసింపుము.

నీవొకధనికకుటుంబపు కన్యను వివాహమాడినచో ఆమెకంటెగాని, వారికంటెగాని తక్కువవాడనని కించపడవద్దు. నీయవసరములకు వారినుండి సహాయమాసింపవద్దు. అదేరీతిని నీభార్య బీదయింటిదైనచో ఆమెను తక్కువగ చూడవద్దు. సమిష్టి కుటుంబములో యిది ముఖ్యముగ పాటింపదగిన నియమము. నీభార్యను నీవేగాక యింటిలోనివారందరును అవమానపరతురు. దాని వల్ల దాంపత్యజీవితము దుఃఖదాయకముగ పరిణమించును. ఆమె యాత్మగౌరవము దెబ్బతినును. ఆమె గౌర

షమును కాపాడి కుటుంబవ్యక్తుల ఆదరమునకు పాత్రు రాలిగజేయుట నీవిధి.

2) నీభార్యకంటె విద్యావంతుడవయినచో నీఆధిక్య మును పనికట్టుకొని ప్రదర్శింపకుము. ఆమె విద్యావిహీ నయగుటచేత నీతో మాట్లడుటకుగాని నీసమస్యలను తె లియజేయుటకుగాని తగనిదని భావింపకుము. స్త్రీ సహ జముగ మంచియోచనాపరురాలు. ఆమె యాలోచనలు, సలహాలు సమస్యలను పరిష్కరించి నీహృదయారాట మును పోగొట్టవచ్చును.

నీభార్య లోపముల నెంచుటయే పనిగ పెట్టుకొన వద్దు. తప్పులను ఎంచవద్దు. 'Err is human' అనగ తప్పుచేయుట మానవులకు సహజము. 'తప్పులెన్ను వారు తమ తప్పులెరుగరు' అన్నాడు వేమన్న. నీవెన్ని తప్పులు చేయుటలేదు ! వాటిని నీభార్య ఓర్మితో సహిం చునుగదా ! స్త్రీ పుట్టుకతో క్షమాగుణము కలది. "ఆమె సుగుణములను ప్రశంసింపుము. ఆమె తప్పులను చూడ వద్దు" అన్నాడు ప్రయర్.

నీకు ఆఫీసులోగాని బయటగాని కలిగిన విసుగును కోపమును యింటిలో భార్యపై పిల్లలపై చూపవద్దు. అనవసరముగ వారిపై ఎగిరిపడుట యవివేకము. వారు బాధ్యులుగారు. నీకు కలిగినబాధలను భార్యకు తెలియ పరచుము. ఆమె యాదరణ, అనునయ వాక్యములు, ఉపచర్యలు నీ మనోవ్యాకులతను పోగొట్టి ప్రశాంతత చేకూర్చును.

నీభార్య బంధువులయెడ సఖులయెడ స్నేహముతో వర్తించి యాదరించి గౌరవింపుము. ముందుగ తెలియప రచకనే స్నేహితులను బంధువులను ఆహ్వానించి వారికి పలహారములు, భోజనములు పెట్టుమని నీభార్యను తొందరపెట్టకుము. వాటిని వండుటకైనను ఆమెకు వ్యవధి కావలెనుగద! ఆమె ఎదుట యితరస్త్రీలను, వారివేషభాషలను, వంటకములను పొగడవద్దు. అందు వల్ల ఆమెమనస్సు కలతచెందును. శంకలు పొడసూ పును. నిరుత్సాహము అశాంతి కలుగును. అవసరమై నచో నిధానముగ నామెకు తెలియజెప్పవలెను. అప్పుడు నీమాటలందలి నిజానిజములు గ్రహించితగినరీతిని వర్తించును. ఆపోహలు కలుగవు.

నీభార్యకు యిష్టములేనిపని చేయుమని, యిష్టములే నిచోట్లకు రమ్మని బలవంతపెట్టకుము. మెలకువతోను సమయస్ఫూర్తితోను వర్తించిన పైపనులనే యిచ్ఛాపూ ర్వకముగ చేయించవచ్చు. ప్రశంస, ముఖస్తుతి ఎట్టివారి నైనను బోల్తాకొటించి ప్రసన్నులుగ జేయును. నీభా ర్యను హేళనజేయుటగాని, మనోవ్యాకులత చెందినపుడు కోపగించుకొనుటగాని చేయవద్దు, అట్లుచేసిన అగ్నికి ఆజ్యము పోసినట్లగును. వీలైనచో అనునయింపుము. లేనిచో ఆమె నొంటరిగ కొంతకాలముండనిమ్ము. ఆమెస్థితిని గమనించి నడుచుకొమ్ము. అదే "మంచిహ టవానికి పాకమెప్పుడు ముదురునో, ఎప్పుడు చల్లా రునో బాగుగతెలియును" అన్నాడు రోలాండ్సు.

5). వివాహమును భార్యపై అధికారమును ధృవప రచు అనుమతి పత్రము (Licence)గ భావింపవద్దు. ఏపనికిగాని పరస్పర సహకారము, సమ్మతము తప్పని సరి, బలవంతపుపనులు ప్రమాదకరములు. బండిఒడు దుడుకులులేక త్రోవలో సరిగ నడవవలెనన్న ఎద్దు రెండును సరిగ నడవవలెను. రెండును రెండువైపులకు లాగిన బండి సాఫీగ ముందుకుసాగదు. నీభార్యను కామతృష్ణనుతీర్చు 'అవసరవస్తువుగ భావింపకుము. ఆమెకు కోరికలు. జీవము కలతని నమ్ముము. స్వతం త్రముగ కొంతవరకు సంచరింపనిమ్ము. ఎందుకనగ కట్టుబాటు కోరికలను విజృంభింపజేయును.

6) ముఖ్యముగ అధికసంతానము స్త్రీని బలహీన ముగ అనారోగ్యవంతురాలిగ జేయును. తల్లి ఎంతబల ముగను ఆరోగ్యముగను వున్న బిడ్డ లంత ఆరోగ్యవం తులుగ నుందురు, ఇదిసత్యము.

భార్యభర్తలు సంవత్సరములో కనీసము నెలరోజు లైనను దూరమగుచుండవలెను. దీనివల్ల వారిలోవిరహ భావములు కలిగి పరస్పరనురాగములు వృద్ధిపొందును. మరల కలుసుకొన్నప్పుడు నూతన ఉత్సాహమును, ఆనందమును. కలుగును. ఇది అనుభవించినవెగాని వ్రాయరాదు. అందువల్లనే "Absence marse the heart grow fonder") ఎడబాటు హృదయమున ప్రేమాద రభావములను యినుమడింపజేయును అన్న అనుభవవి షయము చెప్పబడినది.

ఇట్లు భార్యభర్తలు అనుకూలురై వర్తించిన వారి మధ్య ఏర్పడు వివాదములు సరాగములుగ మారి, అను రాగము కలిగి సౌఖ్యముతో గృహజీవిత మొకస్వ ర్గసుఖముగ పరిగణింపబడును "తథాస్తు".

# గ్రంథ సమీక్ష

కర్షకప్రబోధము, కర్త: కవివర్మ యను సాంకేతిక నామముగల శ్రీ చలసాని లక్ష్మీనారాయణవర్మ; బ్యాంకు పేట, కలవపాదులపోస్టు, (వయా) ఇందుపల్లి; కృష్ణా జిల్లా. వెల. 50 నయాపైసలు.

ఈ కవిగారిదివరకే కొన్ని గ్రంథములు వ్రాసినట్లు తొలిపలుకులవలన తెలియుచున్నది. ఏతద్గ్రంథకర్తగారు రయితుబిడ్డడగుటచే కృషికజీవనమునకు చక్కగ పనుపడి ముక్కాకలు తీరిన అనుభజ్ఞులు. వ్యవసాయ సందర్భమున రైతునకు తటస్థించు బాగోగులను గూర్చి విశదముగ అద్దమునందువల ప్రతిఫలింప జేయువారు. అక్షరాస్యులయిన వారెల్ల చదివి యవగాహనము చేసికొనుటకు వీలగునట్లు చిన్నచిన్న తేటతెలుగు పదములతో ఈ కంద పద్యకృతి వెలువఱుచుట ఎంతేని ప్రశంసార్హము.

అటనట సందర్భానుసారముగ సుబోధమగునట్లు లోకోక్తులను తెలుఁగు పలుకుబళ్ళను ప్రయోగించుటలో ఈ కవిగారు సిద్ధహస్తులు. కొన్ని యుదాహరణములు చిత్తగింపుడు.

రైతాంగము తఱుచుగవాడునట్టి సామెతలు.

ఇల రెడ్లతెగల పేళ్ళను, బలిజాతుల వడ్లపేళ్ళను దెలుపంగ దరముగాదు.

తొలకరి వానలు గురిసిన మొలకలకు దల్లియగును.
రోహిణిగాడ్పునకు బగిలి రోళ్లను రెండౌ.
పొలమును కంచెయె దిగమ్రింగినట్లు.
గుంటెకు బుట్టెడురాలును.
పాకమురోనికి ససియగు శాకముచేకూరదు.

చీమలు చెట్లెక్కినచో భూములు పండునుగదోయి పూర్తిగ.

వానలరాకడ వెండియు ప్రాణము పోకడ నెఱింగి ప్రకటింపరాదు.

మృగశిరలో బిందించిన మిగిలిన కార్తెలను గురియు మేఘములు.

కార్తికపుమాస వర్షము పూర్తిగ మునుగంగజేయు పొలముల.

ఆరుద్రవాన గురిసిన దారిద్ర్యము దారిబట్టి తప్పక పోవున్.

స్వాతిని బడు చినుకులకై, మూతులు విప్పుకొని కాచు ముత్తెపు జిప్పల్.

తూనీగలు దిరుగుచున్న తొందరలోనే వానలు వచ్చుట ధృవము.

మెండుగ వర్షములు చిత్త మేఘాల్ గురియన్ బండునవె జింతచెట్టులు.

వల్లభుడు లేని వనితకు జల్లుపడిన మాఘమునకు జతపడునుగదా.

కొన్ని పలుకుబళ్ళు.

భారీగిత్తలు, అప్పుసప్పు, పొట్టపొడుచు, ఆర్జీలకు పనులగునా, పోవరుసీయరు, అరవనంబరు,—

మొత్తముమీద, ఆబాలగోపాలము ఆదరింపదగిన కృతి. లక్షణ దోషముల కేమిలెండు. గ్రంథస్థాంశములు వెలగట్టరానివి. రైతు చిత్తవృత్తిని ఆకళించుకొన్న శ్రీ కవివర్మ ఇంకను పెక్కు కృతులిట్లు వెలువరించి ఆంధ్రిని ఆరాధింతురుగాక!

—కౌశిక.

విశ్వకవి: సంపాదకుడు, శ్రీ జాస్తి వేంకట నరసయ్య, ప్రధానాంధ్ర పండితుడు, ఆర్. వి. యస్. సి. వి. యస్. హయ్యరుసెకండరీస్కూలు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా. వెల. 75 న. పైసలు.

శ్రీ రవీంద్రనాథఠాకూరు శతవార్షికోత్సవ జయంత్యుత్సవాన్ని పురస్కరించుకొని ప్రత్యేక సంచికగా వెలువడ్డ గ్రంథమిది. ఆ గురుదేవుని యసమాన భాషాసేవను, దేశానురాగమును పలువురు పండిత కవులు తెలిపిన పద్యగద్య గతాభిప్రాయము, లిందు సంగ్రహింపబడినవి. ఆ మహాకవి మేధస్సంపదను అపూర్వభావములను 'విశ్వభారతీ నిర్మాణమును సంక్షేపముగా "విశ్వకవి"లో (వర్ణింప బడిన వైఖరిని) పాఠకులు ముగ్ధులుగాకమానరు.

శ్రీ అడవిబాపిరాజు, సీతారామమూర్తి, జాషువ జవహర్లాలు, ఆచార్యవినోభాజీ, గురజాడ అప్పారావు, మున్నగు విద్వత్కవుల యభిప్రాయములుగూడ తప్పక చదువదగినవి. ఆంధ్ర దేశీయులు విషయ ప్రాధాన్యమునుబట్టి ఆదరింపదగిన గ్రంథము. కౌశిక.

పుష్పమాల: కర్త; శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున రావుగారు, భారతీసమితి, పామఱ్ఱు, కృష్ణాజిల్లా, వెల. 75 నయాపైసలు.

పుష్పమాల యను ఈ ఖండకృతిలోఁ బలుశీర్షికల క్రింద శ్రీ మల్లికార్జునరావుగారు ఎడపదడప నుడివిన పద్యములు పెక్కులు గలవు. రాజకీయ, సాంఘిక, సారస్వత రంగములలో ప్రసిద్ధినందిన ఆంధ్రమహనీయులను గూర్చియు, భావోల్బణమున హృదయ కుహరము నుండి వెలువడిన యనేకాంశములను గూర్చియు స్వానుభవమున నప్పటప్పట నుప్పతిల్లిన సంఘటనముల గూర్చియు, శ్రీరావుగారు, మృదుమధుర శైలిలో లలిత లలితముగ నెల్లర కవగాహనమగునట్లు చెప్పిన పద్యము లత్యంత రమణీయములు. నిరంతర వాఙ్మయారాధకు లగు శ్రీరావుగారి పరిశ్రమ మత్యంత స్తుతిపాత్రము. మచ్చునకొకటి రెండు పద్యములు :

పఱుపుపైబడ్డ నిద్దుర పట్టదయ్యె
నోగిరము దినుకోరిక నుండదయ్యె
నేదిచేయుట కిష్టంబు లేదులేదు,
తల్లి : యెచటికేగితివి పొత్తముల సంచి॥

"అనుదినము నే నెండలో నాఱుమైళ్ళు
నడుచుచుండుట మేలు నా యొడలికిపుడు
ప్రకృతి మానవులకు సాయపడుచునుండె
నంచునేఁడు భావె వచించుచుండె"

"చెల్లదు జూదంబాడుట
చెల్లదు పీల్వంగ బీడి సిగరెట్లెపుడున్
చెల్లదు మద్యము ద్రావుట
చెల్లదు సుమ దొంగతనము చేయుట సుమతీ"

వే. వెం. కృ

స్వీకారము

చలనచిత్ర ప్రదర్శన కళా విశేషముల కభివృద్ధికరముగ దోహదమొనర్చు 'సినిమారంగము' సెప్టెంబరు అక్టోబరు నవంబరు మాససంచికలు మా కార్యాలయమున కందినవి.

కౌశిక.

---

# తపన

## మానేపల్లి సత్యనారాయణ

ఓనాథ ! యీరేయి
నాదు ప్రత్యంగమ్ము
నాదు ప్రత్యణువునూ
తనివితో నీలోన
లయమొంది పోవుటకు
తపన జెందుచునుండె!

ఓనాథ ! యీరేయి
సుకుమారమని నీవు
పొగడెడి తనూవల్లి
నీతోన గాటముగ
నల్లుకొనిపోవగా
తపన జెందుచునుండె!

ఓనాథ ! యీరేయి
సువిశాలమయిన వని
నీవు పొగడిన కనులు
నీదు సుందర దేహ
మంత తమచూపులను
కప్పివేయగ చాల
తపన జెందుచునుండె!

ఓనాథ ! ఓనాథ !
తపన జెందుచునుంటి
దజేరి దయ గనవ !

# వార్తావళి



**న్యూఢిల్లీ:** కేరళ. ఒరిస్సాలకుతప్ప, తక్కినదేశం అంతటా రాష్ట్రశాసనసభలకు, లోక్‌సభలకు ఫిబ్రవరి రెండవపక్షంలో అనగా, ఫిబ్రవరి 19–25 తారీఖుల మధ్య ఎన్నికలు జరుగుతాయి. ఇప్పుడున్న రాష్ట్ర సభలు 1–3–1962 తేదీతోను, లోక్‌సభ 13 3-1962 తారీఖుతోను, రద్దుఅవుతుంది. రాష్ట్రపతిని ఉపరాష్ట్రపతిని 6-5-1962 తేదిన ఎన్నుకోవటం జరుగుతుంది అని ప్రధాని నెహ్రూ లోకసభలో ప్రకటించాడు.

బ్రిటను ఫ్రాంసుదేశాలు, తమ స్వాధీనంలో వున్న వలసరాజ్యాలను ప్రశాంతంగా కొన్నినిబంధనలకు లోబడి విడిచిపెట్టిపోయినమోస్తరు, పోర్చుగీసువారున్ను- గోవా మొదలయిన చిన్నవలసరాజ్యాలను విడిచివెళ్లగలరని 12 సంవత్సరాలుగా ఎదురుచూచామని ప్రశాంతంగా వాళ్లు దారికివచ్చేమార్గం కనబడలేదని తెలిసిపోయింది. గోవాలోని సోదరభారతీయులు నానాకష్టాలకు పాల్పడుతున్నారని, పోర్చుగీసు ప్రభుత్వం యొక్క అమానుషకృత్యాలు, దౌర్జన్యాలు నానాటికి ఎక్కువవుతూవున్నాయనీ, తీవ్రమయిన చర్యలు జరిపేపక్షంలో మూడుదినాల్లోనే భారతప్రభుప్వం దాన్ని అదుపులోకి తెచ్చుకోగలదనీ, ప్రకృతం ఈ విషయంలో అన్నిదేశాలు భారతప్రభుత్వముయొక్క అభిప్రాయాన్ని బలపరుస్తూన్నదనీ త్వరలోనే యీ సమస్యను తేల్చగలదని ప్రధాని నెహ్రూ– మెక్సికోలో పత్రికావిలేఖకులకు విస్పష్టం చేశాడు.

రెండువారాలు అమెరికా పర్యటన ముగిసినతరవాత— ప్రపంచరాజకీయ పరిస్థితులనుగూర్చి ఆరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు– నాసర్‌ను యుగోస్లోవియాఅధ్యక్షుడు టిటోను కలిసి సంప్రదించటానికి సరాసరి న్యూయార్కునుండి కెయిరోకు వెళ్లేడు. అక్కడ ఒకదినం కంటె ఎక్కువగా నిలిచే అవకాశంలేకపోయినా.– అన్ని విషయాలు సమగ్రంగా చర్చించారు.

మద్రాసు రాష్ట్రానికి డైరెక్టర్– ఆవ్ మెడికల్ సర్వీసెస్, పదవికి 'డాక్టర్– ఏ. మారిక' నియమించబడ్డది. మొట్టమొదటిసారిగా ఈ ఉన్నతోద్యోగానికి ఎన్నుకోబడ్డ మహిళామణి యీమే.

అమెరికా. "అధ్యక్షుడు శ్రీకెన్నడీ 1962 జనవరి ప్రాంతాల్లో వస్తాడు. ఆయన సతీమణి 11 జనవరికి ముందువెనుకలుగా (ప్రత్యేకంగా) వచ్చి భారతదేశ రిపబ్లిక్‌దినోత్సవాలలో పాల్గొంటుంది" అని అమెరికాదేశ రాయబారి శ్రీగాల్‌బ్రెయిత్ వెల్లడించాడు.

**న్యూఢిల్లీ:** భారతసరిహద్దు ప్రదేశంలో ఇటీవల చైనా దురాక్రమణాన్ని గూర్చి 28-11-62 నను, పాకిస్తాను వారు శ్రీభట్టాచార్యకు విధించిన యెనిమిదేండ్ల శిక్షను గూర్చి 29-11-62 నను లోక్‌సభ చర్చిస్తుంది. భారతనావికాదళాధ్యక్షుడు Former (Commander) ప్రేమ్ భగవాన్‌దాసు ఆహూజాను హత్యచేశాడనే నేరంక్రింద శ్రీనానావతికి బొంబాయి ఉన్నతస్థానం, యావజ్జీవ కారాగార శిక్ష విధించగా, దాన్ని రద్దు చేయకోరిన నానావతిని అఖిలభారతోన్నతన్యాయస్థానంవారు (Judges of Supreme Courr) మరలా విచారించి క్రిందికోర్టుచేసిన తీర్మానాన్ని ఖాయ పరుస్తూ—నానావతి విన్నపాన్ని త్రోసివేశారు.



"చేతులారంగ శివపూజ చేయఁడేని,
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని,
దయయు సత్యంబు మదిలోనఁ దలఁపఁడేని,
గలుగ నేటికిఁ? తల్లులకడుపుచేటు"

(పోతన)

# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంచే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - 4
బొంబాయి - 1.
కలకత్తా - 7